# గమనించండి

### రామకృష్ణంరాజుగారి హత్య.

5-6-1939 వ తేదీని బెజవాడలో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారి అధ్యక్షతను సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో యీ క్రింది తీర్మానం ఆమోదించబడింది:

"భీమవరం పంచాయితీబోర్డు వ్యవహారములను కాంగ్రెసు సంఘం తరఫున పరిశీలిస్తూ ఉండిన శ్రీ అల్లూరి రామకృష్ణంరాజుగారిని ఎవరో హత్య గావించడము రాజకీయోద్దేశముతోనే అని అనుకోవడానికి కారణమువుతోంది. దీనికి కారకులెవరో ప్రభుత్వం కనుగొనలేక పోవుట చాల గర్హనీయము. ప్రజాహిత కార్యమందు తమ ప్రాణముల గోల్పోయిన రామకృష్ణంరాజుగారి ధైర్యత్యాగములను యీ సభవారు హర్షించుచున్నారు."

★ ★ ★

### ప. గోదావరి జిల్లా

27-5-1939 వ తేదీని పూళ్లగ్రామంలో శ్రీ కొటికలపూడి ఆంజనేయులుగారి అధ్యక్షత క్రింద జరిగిన పశ్చిమ గోదావరి జిల్లాయందలి అన్ని తాలూకా కాంగ్రెసు సంఘముల అధ్యక్ష, కార్యదర్శుల సమావేశంలో యీ క్రింది తీర్మానం చేయబడింది:

కీర్తిశేషులు అల్లూరి రామకృష్ణంరాజుగారి దారుణ హత్యకు యీ సభవారు చింతిల్లుచూ వారి ఆత్మకు శాంతి చేకూర్చుటకు భగవంతుని ప్రార్థించుచూ, వారి కుటుంబమునకు యీ సభవారు తమ హృదయపూర్వక సానుభూతిని తెల్పుచున్నారు.

"శ్రీ అల్లూరి రామకృష్ణంరాజుగారు సుమారు వారం రోజుల క్రిందట చిత్రవధ గావించబడినప్పటికీ, నేటికి తగుచర్య తీసుకొనకుండానున్న స్థానికాధికారుల చర్యను యీ సభవారు గర్హించుచూ, అక్కడనున్న స్థానికాధికారుల మార్చినగాని తగు వివరములు దొరకవుగాన వెంటనే ఆవిధంగాచేసి నిష్పక్షపాతబుద్ధిగల అధికారులను వెంటనే నియమించి తగుచర్య తీసుకొనవలసినదిగా ప్రభుత్వము వారిని యీ సభవారు కోరుచున్నారు.

2-6-39 వ తేదీని పాలకోడేరులో సమావేశమైన భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ జనరల్‌బాడీ సమావేశంలోను, 5-6-39 వ తేదీని పాలకొల్లులో సమావేశమైన నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యనిర్వాహకవర్గ సమావేశంలోను 1-6-39 వ తేదీని జరిగిన పాలకోడేరు, అయిభీమవరం గ్రామ కాంగ్రెసు కమిటీ సమావేశాలలోను పైవిధంగానే తీర్మానాలు చేయబడ్డాయి.

★ ★ ★

### తూ॥ గో॥ జిల్లా కాం॥ సోషలిస్టుపార్టీ సాంవత్సరిక మహాసభ.

4-6-39 తేదీని ఉదయం 8 గంటలకు పార్టీ ఆఫీసులో కామ్రేడ్ పెన్మెత్స సూర్యనారాయణగారి అధ్యక్షతను పై మహాసభ జరిగినది. జిల్లాలోని వివిధప్రాంతములనుండి పార్టీ సభ్యులు సభకు హాజరైరి.

పార్టీ సభ్యురాలైన కామ్రేడ్ గోవిందమ్మగారి అకాల మరణమునకు విచారమును తెలియజేస్తూ ఏకగ్రీవముగా తీర్మానించబడెను. కార్యదర్శి గత సంవత్సరపు రిపోర్టు చదివినపిమ్మట ఏకగ్రీవముగా ఆమోదించబడెను తరువాత జిల్లాపార్టీ నిబంధనావళి భావి కార్యక్రమము, కొన్ని నిర్మాణ సమస్యలనుగురించిచర్చ జరిగి నిర్ణయాలు జరిగిన పిమ్మట ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడెను.

1. సామర్లకోటలో ది డెక్కన్ షుగర్ అండ్ అబ్కారీ ఫ్యాక్టరీ కూలీల సమ్మె సందర్భములో అరెస్టు చేయబడినవారిపై నున్న కేసులను సమ్మె పరిష్కారమైన పిదపకూడ ప్రభుత్వము రద్దుచేయనందుకు విచారమును తెలియజేయుచు వెంటనే ఆ కేసుల నుపసంహరించుకోవలసినదిగా మద్రాసు మంత్రివర్గమును ఈ సభవారు కోరుచున్నారు.

2. రాజధానిలో కూలీ పరిస్థితులు చాల అక్రమముగనున్నవి. యజమానులు కూలీల వేతనములు తగ్గించుట హెచ్చు కాలము పని చేయించుకొనుట కార్మిక సంఘాలను గుర్తించకపోవుట అనేకమంది పనివారలను నిరుద్యోగులుగ చేయుట, మొదలగు చర్యలు సాగిస్తున్నారు. కార్మిక లోకానికి కొంతమైన శాంతిని కలుగచెయ్యాలంటే కాంగ్రెసు మంత్రివర్గము అనుకూలమైన కార్మిక చట్టమును తక్షణమే తీసుకు రావాలని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

పిమ్మట ఈ క్రింది కార్య నిర్వాహకవర్గమును నూతన సంవత్సరమునకు ఏకగ్రీవముగ ఎన్నుకొనబడిరి.

1. కామ్రేడ్ కొంపాటి పట్టాభిరామయ్య. కార్యదర్శి
2. .. పి అనంతంగారు
3. .. సి. వి కృష్ణారావుగారు
4. .. పెన్మెత్స సూర్యనారాయణగారు
5. .. రావు వెంకటరంగారావుగారు
6. .. ఇనుగంటి నారాయణరావుగారు
7. .. చింతం సత్యనారాయణదాసుగారు
8. .. చొప్పల నవరత్నంగారు
9. .. కాకరాల కామేశ్వరశాస్త్రిగారు

పెన్మెత్స సూర్యనారాయణ,
కార్యదర్శి.

★ ★ ★

### ఫెడరేషన్, యుద్ధవ్యతిరేక ప్రచారం.

ఈనెల 5 వ తేదీని జరిగిన నర్సాపురం తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో యీక్రింది తీర్మానం ఆమోదించబడింది:

"త్రిపురీ కాంగ్రెసు మన ఆదర్శమైన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి నేటి జాతీయ-అంతర్జాతీయ పరిస్థితులలో రానున్న పోరాటానికి దేశమంతట విశాల ఉద్యమమును నడిపించే సన్నాహం చేయడానికి ప్రజాసామాన్యాన్ని కోరియున్నది. ఈతీర్మానాన్ని ఆచరణలో పెట్టుటకు మనతాలూకాలోని ప్రతి ఫిర్కాలోగల తాలూకా కాంగ్రెసు సభ్యులు సమావేశమై ఫెడరేషన్ ప్రతిఘటన, యుద్ధవ్యతిరేక జాతీయ వాంఛ, తీర్మానములను యీ క్రింది సూచనల ననుసరించి ఆయా ఫిర్కాలలోని అన్ని గ్రామాలయందు బహిరంగ సభలు జరిపి, ప్రచారము గావించవలసినదిగా యీసభవారు తీర్మానించుచున్నారు: కాంగ్రెసు చరిత్ర—భారత స్వాతంత్ర్య పోరాటం; కర్షక ప్రాథమిక హక్కులు; ఎన్నికల ప్రణాళిక; ఫెడరేషన్ ప్రతిఘటన; మంత్రుల ప్రజాహిత కార్యములలో బ్రిటిష్ గవర్నమెంటుయొక్క అడ్డంకుల నెదుర్కొనుటకు ప్రజాందోళనావశ్యకత; ప్రజాప్రతినిధి పరిషత్తు."

తాలూకాలోని ప్రతి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సభ్యుడు 200 మందిని, జిల్లా కాంగ్రెసుసభ్యుడు 150 మందిని, తాలూకా కాంగ్రెసు సభ్యుడు 100 మందిని, కాంగ్రెసు సభ్యులను చేర్పించవలసినదిగా మరొక తీర్మానం చేయబడింది.

★ ★ ★

### 'ఫార్వర్డుబ్లాకు'పై తీర్మానాలు.

2-6-39 వ తేదీన బాపట్ల తాలూకా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నర్సాయపాలెం గ్రామములో కామ్రేడ్ ఐ. యస్. రంగనాయకులుగారి అధ్యక్షతక్రింద సమావేశమై, యీ క్రింది తీర్మానం గావించింది.

కాంగ్రెసులోని అతివాదులందరినీ ఏకము చేసి, స్వాతంత్ర్య పోరాటాన్ని తీవ్ర మొనర్చుటకై శ్రీ సుభాష్ చంద్రబోసుగారు ఏర్పరచుచున్న 'ఫార్వర్డు బ్లాక్'ను యీ సభవారు సమర్థించుచు, కాంగ్రెస్ సోషలిస్టులు దానిలో చేరుట అవసరమని అభిప్రాయ పడుచున్నారు. 'ఫార్వర్డ్ బ్లాక్'లో చేరకూడదని అ॥ భా॥ కాం॥ సోషలిస్టుపార్టీవారు క్రింది పార్టీలతో చర్చించకుండా యీ నిర్ణయం చేయుట సరిగా లేదు గనుక ముందుగా స్థానిక, జిల్లా, రాష్ట్ర పార్టీలను సమావేశపరచి వారి అభిప్రాయాను సారముగా ఆఖరు నిర్ణయం చేయవలయునని యీ సభవారు అ॥ భా॥ కాం॥ సో॥ పార్టీవారిని కోరుచున్నారు. 'ఫార్వర్డ్ బ్లాక్'ను స్థాపించునప్పుడు అతివాద పార్టీల సలహాను తీసుకొని, కాంగ్రెసు వ్యతిరేకులు, అవకాశవాదులు మొ॥ వారు చేరకుండా నిబంధనలను ఏర్పరచవలయుననియు, నెహ్రూగారు చెప్పిన అపోహలకు తావులేకుండునటుల పార్టీని కట్టుదిట్టము చేయవలయుననియు, బోసుగారిని యీసభవారు కోరుచున్నారు."

★ ★ ★

### పామర్రు ఫిర్కా సోషలిస్టులు.

5-6-39 వ తేదీని పెదమద్దాలితో పామర్రు ఫిర్కా కాం॥ సో॥ పార్టీ సమావేశం కామ్రేడ్ కాట్రగడ్డ రాజగోపాలరావుగారి అధ్యక్షతను సమావేశమై, 'ఫార్వర్డుబ్లాక్'లో చేరకూడదని అ॥ భా॥ కాం॥ సో॥ పార్టీవారు తీర్మానించుట అతివాద కార్యక్రమానికి నష్టదాయకము గాన ఆ తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలనియూ, అందుకై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ వారు తీవ్రంగా ప్రయత్నించాలనియు, తీర్మానించబడింది.

★ ★ ★

### ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘ వర్కింగు కమిటీ

పైసంఘ సమావేశం బెజవాడలో కామ్రేడ్ యర్రమిల్లి నరసింహారావుగారి అధ్యక్షతను 10-6-39 వ తేదీని జరిగినది. ఈక్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి.

1. ఈ కమిటీ ఆర్. వెంకటరత్నం నాయుడు, శ్రీ చిలుకూరి వీరభద్రరావు, కామ్రేడ్ పి. గోవిందమ్మగార్ల మరణమునకు వారికుటుంబములకు సానుభూతి చూపుచున్నది.

2. స్కూలుఫైనల్ పరీక్షఫలితములు చాల శోచనీయంగా ఉన్నాయనీ బోర్డువారు వాటిని పునస్సమర్శించి ఎక్కువమందిని ఉత్తీర్ణుల చేయవలెననీ,

3. 16 వ ఆంధ్రరాష్ట్ర మహాసభ ఆగస్టు రెండవ లేక మూడవ వారమున జరుపవలెననీ,

4. ఒక సంవత్సరం ఫెయిల్ అయినంత మాత్రమున విద్యార్థులు సగం జీతం పొందకుండా చేయడం తగదనీ,

5. అన్నామలై విద్యార్థుల పోరాట విషయమున వారి నభినందించుచు మంత్రివర్గపు వ్యక్తవిధమును ఖండించుచునూ

6. కటక్ వైద్యవిద్యార్థుల సమ్మె జయప్రదముగా జరిపినందుకు ఆరాష్ట్ర విద్యార్థి సంఘమును నభినందించుచును,

7. రాజధాని విద్యార్థి ఫెడరేషన్‌కు శ్రీ పాలెపు సత్యనారాయణశర్మ, యర్రమిల్లి నరసింహారావుగార్ల నుసభ్యులుగానియమించుచును.

8. సింగరాయపాలెం, భోగాపురం గ్రామములలో వయోజన విద్యాప్రచారమును జయప్రదముగా జరిపిన శ్రీ రమణయ్య, నారాయణరావుగార్లను గుడివాడ విద్యార్థి సంఘమును అభినందించుచును

9. రాష్ట్రమునందు కనీసము పది ప్రాంతములందు వాలంటీరు దళమును స్థాపింపవలెననియు

10. అక్టోబరు 10 వ తారీఖున వాల్తేరులో జరుగనున్న ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవ సమయమున హైదరాబాద్ ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గ అధ్యక్షులగు సర్ అక్బర్ హైదరీగారి స్నాతకోపన్యాసమును ఆంధ్ర పట్టభద్రులు బహిష్కరింపవలెననియు,

11. చిట్టివలస జూటుమిల్లు సమ్మె కాల్పులకు గురియైన 70 మందిని పరీక్షించి ఎంక్వయిరీ కమిటీయెదుట సాక్ష్యము చెప్పిన డా. వెంకయ్య, సి. వి. సుబ్బారావుగార్లను అభినందించుచును తీర్మానింపబడెను.

★ ★ ★

### ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘం
#### సమ్మెసంఘ సమావేశము

బెజవాడలో జరిగిన రాష్ట్ర విద్యార్థి మహాసభలో నియమించబడ్డ జనరల్ స్ట్రయిక్ సబ్ కమిటీ సమావేశము 20-6-39 వ తారీఖున సాయంత్రం 4 గంటలకు కమ్మహాస్టలులో సమావేశమవును.

ఎజండా

1. విద్యాశాఖాధికారులవద్దకు రాయబారములు.
2. ధనసేకరణము.
3. సంచార కార్యక్రమము

యింకా యితర విషయాలు కాన సభ్యులెల్లరు తప్పక రాప్రార్థన.

కన్వీనరు.
జనరల్ స్ట్రయిక్ కమిటీ,
ఆం॥ రా॥ విద్యార్థి సంఘం



సంపుటం 2 నవశక్తి బుధవారం
సంచిక 26 14-6-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, చుక్కల వెంకట రామయ్య.

## కాంగ్రెసు నిబంధనావళిలో మార్పులు

గాంధీజీ హరిజన్‌లో కాంగ్రెసులోని కుళ్ళును తొలగించాలని వరుసగా వ్యాసాలు వ్రాసాడు. బొంబాయిలో కాంగ్రెసు ప్రతినిధులుగా కమ్యూనిస్టులు అత్యధిక సంఖ్యాకుల ఓట్లలో ఎన్నుకోబడినపుడు, బోసు తన అభీష్టానికి వ్యతిరేకముగా అధ్యక్షుడుగా ఎన్నుకోబడినపుడు, కాంగ్రెసులో అభిలషింపరాని అనేక శక్తులు ప్రవేశించాయనీ, "సత్య, అహింస"లపై అవిశ్వాసం గలవారు మాత్రమే కాంగ్రెసులో వున్నపుడు తన గమ్యస్థానాన్ని చేరగల్గుతుందనీ వాపోయాడు. నిజమాలోచించితే కాంగ్రెసులో అధికారములందును, మంత్రిపదవులందును హెచ్చుగా వున్న గాంధీయులు మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు వగైరా సంస్థల ఆక్రమణ ప్రయత్నములో కాంగ్రెసు లక్ష్యమైన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కూడ అంగీకరించక జస్టిస్ వగైరా జాతీయ విద్రోహక పార్టీలకు చెందిన, అధికార పదవు లాశించిన అనేకమందిని "ఖద్దరు ధోవతులు" కట్టబెట్టి కాంగ్రెసులో చేర్చుకొన్నారు. ఏమైనా కుళ్లువుంటే ఇట్టివారే కాంగ్రెసులోని కుళ్లు. పదవు లాపేక్షతోనే ప్రవేశించిన ఇట్టివారు కాంగ్రెసు పోరాట కార్యక్రమము ఆవలంబించగానే తుడిచిపెట్టుకుపోతారు. కాని మహాత్ముడు, గాంధీయులు కోరేది ఇట్టివారిని శుద్ధిచేయుటకుకాదు. మంత్రులు కాంగ్రెస్ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టకపోవడాన్ని, గాంధీయుల దిగజారుడు పాలసీని వ్యతిరేకించుతూ, యుద్ధాన్ని ఫెడరేషనును వ్యతిరేకించడానికి భారతజాతీయ పోరాటానికి సర్వసన్నాహాలు గావించాలని కోరుతున్న తీవ్రవాదులను—కమ్యూనిస్టులు, సోషలిస్టులు, కిసాన్‌నాయకులను—కాంగ్రెసునుండి వెడలగొట్టుటకు లేక వారికి "సత్య,అహింసల" పేర కాంగ్రెసులో స్థానములేకుండా చేయుటనే గాంధీయులు కోరుతున్నారు. వారు చేయగోరు శుద్ధి అట్టిదియే. ఇక త్రిపురీ కాంగ్రెసు తీర్మానముప్రకారము కాంగ్రెసులో కుళ్లు ప్రవేశింపకుండ జేయడానికి కలకత్తా అఖిల భారత కాంగ్రెసుచే నియమింపబడిన "కాన్‌స్టిట్యూషనల్ సబ్ కమిటీ" ప్రకటించిన రిపోర్టును పరిశీలించుదాము.

ఈ కమిటీ చేసిన సూచనలలో ఐదు ముఖ్యమైన మార్పులున్నాయి.

(1) జిల్లా కాంగ్రెసు సంఘాలు ఒక స్థిరమైన సభ్యత్వ రిజిష్టర్లు వుంచుతాయి. ఒకసారి సభ్యులయినవారు మరల చేరనవసరములేదు: ప్రతి సంవత్సరము ఆగష్టు 31 తేదీ లోపల పావులా చెల్లించి సర్టిఫికేటు పొందిన అతని సభ్యత్వము కొనసాగును. కొత్తగా సభ్యులుగా చేరువారు ఆఫీసుకువెళ్ళి పర్మనెంటు రిజిష్టరులో సంతకము వగయిరా నమోదుచేసి సర్టిఫికేటు పొందాలి. ఈ సర్టిఫికేటులను చూపిన వారికి మాత్రమే ఎన్నికలలో ఓటింగు హక్కు ఉండును. ఈ సభ్యులను చేర్పించి సర్టిఫికేటులను యిచ్చు హక్కు జిల్లా సంఘానికి మాత్రమే వుంటుందో, లేక యిప్పటివలే గ్రామ సంఘాలకుకూడ వుంటుందో స్పష్టపరుపబడలేదు. పర్మనెంటు రిజిష్టర్లనుంచి జిల్లా సంఘానికి మాత్రమే యీ హక్కు ఉన్నచో, ప్రజా సామాన్యం కాంగ్రెసులో చేరుటకు వీలే వుండదు. ఏమంటే 100 మైళ్ళవరకు దూరానవుంటున్న సామాన్య ప్రజలు తమ సభ్యత్వాన్ని రిజిష్టరు చేయించుకొనుటకు జిల్లా ఆఫీసుకు వెళ్లుట సంభవంకాదుగదా? ఈ పద్ధతినే కమిటీ సూచించినచో కాంగ్రెసు ప్రజాసంస్థగా గాక గాంధీసేవా సంఘముగానో, కొలదిమంది పైతరగతులవారి సంస్థగానో తయారవుతుంది. సభ్యుల జేర్పించు హక్కు ప్రతి గ్రామ సంఘానికీ ఉండాలి: కాంగ్రెసు సేవకులు ప్రజలలో ప్రబోధంచేసి సభ్యుల జేర్పించినప్పుడే కాంగ్రెసు సందేశము ప్రజలలోకి బాగా ప్రాకుతుంది.

(2) జిల్లా, రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికలలో నిలబడువారు వరుసగా మూడు సంవత్సరాలు సభ్యులై వుండాలి. అంటే నూతనముగా కాంగ్రెసులో జేరువారికి ఎన్నికలలో హక్కుండదు. మితవాదులు యిపుడు తమ స్వాధీనములో వున్న కాంగ్రెసు స్వభావం మారిపోకుండా వుంచటానికి యిది రక్షణగా పెట్టుకొన్నారు భారత జాతీయ పోరాటాన్ని నిరంతరము సాగించే సంస్థ కాంగ్రెసు మహాసభ. ఎల్లపుడూ కొనసాగే మన జాతీయ పోరాట అనుభవము ద్వారా బయలుదేరే నవ్యశక్తులు కాంగ్రెసు సంఘాలలోనికి రావడానికి యీసూచన అడ్డుపడుతుంది. ప్రపంచ పరిస్థితుల ననుసరించి ప్రజల చైతన్యాభివృద్ధి ననుసరించి మన పోరాట గమనము మారుతుంది. ఈ మార్పులు కాంగ్రెసులో ప్రతిఫలించాలి. అటుల గాక కృత్రిమరక్షణల ద్వారా వీని నరికట్టినచో కాంగ్రెసుకు, ప్రజలకు మధ్య అఘాత మేర్పడుతుంది. అందుచే యీ సూచన మేమంగీకరించజాలము: కాంగ్రెసు సభ్యులందరికి ఎన్నుకోబడే అధికారముండాలి.

(3) కాంగ్రెసుమహాసభ ప్రతినిధుల నియోజకవర్గాలు యిప్పటివలె కాంగ్రెసు సభ్యుల సంఖ్యను బట్టి నిర్ణయింపబడవు స్థిరమైన ప్రాంతీయ నియోజక వర్గాలు ఏర్పరచబడతాయి. నిర్ణీతమైన సభ్యుల సంఖ్యలో సగము కూడా చేర్పించబడని నియోజకవర్గానికి ప్రాతినిధ్యముండదు. ఈసూచనవలన ఎక్కువ సభ్యులను చేర్పించుటకు జిల్లాలమధ్య జరుగు పోటీ, దానితోపాటు అనవసర హడావుడీ కొంత తగ్గుతుంది. సామాన్య సభ్యులందరిచే ప్రతినిధు లెన్నుకోబడతారు. ఈమార్పు అందరూ అభిలషించవలసినదే.

(4) అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఎన్నికలు ఇప్పటివలేకాక "ప్రపోర్షనల్ రిప్రెజెంటేషను" (సింగిల్ ట్రాన్స్‌ఫరబిల్ ఓటింగుద్వారా) $\frac{1}{3}$ స్థానాలకి మాత్రమే పెద్ద రాష్ట్రాలన్నిటిలో—వుంటుంది. తక్కిన $\frac{2}{3}$ స్థానాలకు రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ, సభ్యుల సంఖ్యను దృష్టిలో వుంచుకొని ప్రాంతీయ నియోజక వర్గాలు ఏర్పరచుతుంది. ఆ ప్రాంతములోని ప్రతినిధులు (రాష్ట్ర సంఘ సభ్యులు) మెజారిటీ ద్వారా—డిస్ట్రిబ్యూటివ్ ఓటింగుద్వారా—తక్కిన అ॥ భా॥ కాం॥ సభ్యులు ఎన్నుకోబడతారు. ఈ పద్ధతి వలన మైనారిటీలకు అ॥ భా॥ కాం॥ సంఘములో ప్రాతినిధ్యం కష్టసాధ్యమవుతుంది. రాష్ట్రంలో అధికారముకోవున్న కాంగ్రెసువారికి లాభకరం. వ్యతిరేకులకు ప్రాంతీయ నియోజక వర్గాలద్వారా మెజారిటీ ఎన్నుకోబడుటకు అవకాశమే ఉండదు. సబ్ కమిటీలో సోషలిస్టు సభ్యుడయిన ఆచార్య నరేంద్రదేవ్ యీ సూచనకు వ్యతిరేకించాడు. ఇది అల్ప సంఖ్యాకులు అ॥ భా॥ కాంగ్రెసు కమిటీలోకి రాకుండా చేయడానికి యెత్తు అనే ఆక్షేపణ వస్తుందని స్పష్టపరచాడు. అ॥ భా॥ కాం॥ కమిటీ కాంగ్రెసు సంస్థలోని అన్ని దృక్పధాలకు ప్రాతినిధ్యం వుండాలని కోరేవారు, ప్రజా స్వామిక సూత్రాలకు గౌరవ మిచ్చేవారు, యీ సూచనను తప్పక ఎదిరించుతారు.

(5) ఆఖరుకు చెబుతున్నా అత్యంతప్రాముఖ్యమైన మార్పు సూచన V లో 2 వ క్లాజులో "కాంగ్రెసు ఆదేశములకు వ్యతిరేకమైన, రాజకీయ కార్యక్రమము గల మత సాంఘిక సంస్థలలో సభ్యుడుగా నుండరాదు" అని వుంది. దీని లోని "మత సాంఘిక సంస్థలలో" అనుటకు బదులు "మత,సాంఘిక, తదితర సంస్థలలో సభ్యుడుగా వుండరాదు" అని మార్చాలని సూచింపబడింది. ఈ సూచనకు జవహర్ లాల్ నెహ్రూ, ఆచార్య నరేంద్రదేవు గార్లు అసమ్మతి తెలిపారు. దీనిద్వారా వర్కింగుకమిటీల చేతులలో విపరీత అధికారము వుంచబడుతూందని ఆక్షేపించారు. ఇదివరకే కాంగ్రెసులో హెచ్చుగా వున్న అభిప్రాయ భేదాలు ఇంకా హెచ్చుతాయనీ, కాంగ్రెసు ఆశయముపంటి రాజకీయాశయాలే కల్గి ఉన్నా, ప్రత్యేక ఆర్థిక కార్యక్రమము కలిగివున్న కార్మిక కర్షక వర్గ సంఘాలపై ఈనిషేధము విధించుట అపాయకరమనీ నరేంద్రదేవ్ స్పష్టపరచాడు.

ఈ సూచనలద్వారా గాంధీయులు తాము కోరిన ఏకాభిప్రాయములే వర్కింగు కమిటీలో వుండాలనడాన్ని కాంగ్రెసుసంస్థలోనే ప్రవేశపెట్టజూస్తున్నారు. ఏ.ఐ.సి.సి. ఎన్నికల మార్పు ద్వారా అఖిలభారత కాంగ్రెసు కమిటీలో తమ దిగజారుడు విధానానికి ఎదురు చెప్పేవారు లేకుండా చేయబూనుకొన్నారు. ప్రజలలో వృద్ధిఅవుతున్న స్వాతంత్ర్య పోరాటాభిలాష, రాజీ విధానముపై అసంతృప్తి కాంగ్రెసు సంఘాలలో ప్రతిధ్వనింప జేయకుండుటకు మూడు సంవత్సరాల నియమంద్వారా ప్రయత్నించుతున్నారు. "ఏయితర సంస్థల"లోను సభ్యులుగా వుండరాదనే నియమం ద్వారా కార్మిక కర్షక సంఘాలలో పనిచేయువారిని సోషలిస్టులను, కమ్యూనిస్టులను వెలిబెట్ట పూనుకొన్నారు.

ఈ సూచనలు అవలంబించబడుచో కాంగ్రెసు ప్రజాభిప్రాయాన్ని విశదీకరించే ప్రజా ప్రతినిధిసంస్థగా వుండజాలదు; కొలదిమంది గాంధీయులు, మితవాదుల సంస్థ అవుతుంది: గాంధీ సేవాసంఘానికి ప్రతిబింబ మవుతుంది. బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని నాశనము గావించే భారత జాతీయ విప్లవ ప్రజా సంస్థగా వుండబోదు: రాజీ కొరకు ప్రాకులాడే మితవాద సంస్థ అవుతుంది. అందుచే స్వాతంత్ర్యము కోరేవారంతా ఆత్మ వినాశకరమైన యీ సూచనలను ఎదిరించాలి. రానున్న అఖిలభారత కాంగ్రెసు కమిటీ వీనిని త్రోసివేయాలి. తీవ్రవాదులంతా కలసి ఐక్యతతో పని చేసి సభ్యులందరికి దీని నిరుపయోగతను, అపాయాన్ని స్పష్టపరచి ఈ సూచనలను ఓడించుటలో జయం పొందుతారని ఆశించుతాము.

# విశాలరాజకీయాలు

**బ్రిటిష్‌వారి ధర్మకర్తృత్వం.**

బ్రిటీష్ కలోనియల్ సెక్రటరీ అయిన మాక్డొనాల్డు (రామ్సే మాక్డొనాల్డు కొడుకు) పార్లమెంటు సభలో ఉపన్యసిస్తూ, ఇండియా-బర్మా దేశ ప్రజలు శాసన నిర్మాణ కార్యక్రమం విషయంలో చాలా ముందడుగు వేస్తున్నారని పొగిడాడు. కాని, యీ కార్యక్రమంతోబాటు ప్రజా సామాన్యంకూడా ప్రత్యక్ష పోరాటాలలో ముందడుగు వేస్తూన్న విషయంకూడా మాక్డొనాల్డు మరచిపోకూడదు. సామ్రాజ్యవాదుల ఇట్టి పొగడ్తలు కొంతమంది కాంగ్రెసు మంత్రుల దృష్టిలో ఎక్కువ విలువను కలిగియున్నప్పటికీ, ప్రజా సామాన్యము మాత్రం సంతోషించే స్థితిలోలేదు.

"కలోనియల్ రాజ్యాలలో అత్యధిక భాగం బ్రిటిష్ వారి ధర్మకర్తృత్వంలోనే ఉంది. అనేక బాధ్యతలను మీద వేసుకున్న బ్రిటిషువారికి కలోనియల్ సామ్రాజ్యాన్ని పరిపాలించే బాధ్యతకన్న ఎక్కువది లేనే లేదు." అంటూ మాక్డొనాల్డు పలికాడు. ఈవాక్యాలు ఎక్సెషన్, రొడీషియా, బ్రిటిష్‌గయానా, నయాసాలండ్ మొదలైన రాజ్యాలకే అన్వయించినప్పటికీ, ఇండియావంటి పరాధీన దేశాలనుకూడా మనస్సులో ఉంచుకొని చెప్పాడనడంలో సందేహం ఏమాత్రమూ లేదు. తమసామ్రాజ్యాన్ని రక్షించుకొనడానికి బ్రిటిషు పాలకులు మొట్టమొదట యే బూటకపు కబుర్లు చెప్పారో, యిప్పుడూ ఆ కబుర్లే చెప్పడం చూస్తున్నాం. అయితే పూర్వము ఆ కబుర్లు విని ప్రజలు మోసపోయేవారు. యిప్పుడు మాత్రం అలా మోసపోయేవారెవరూ లేరు. ఇండియాలోనూ అంతే.

**వర్తకపుటొడంబడికపై స్టాన్లీప్రభువు**

ఇండో-బ్రిటిషు వర్తకపుటొడంబడికపై స్టాన్లీ ప్రభువు పార్లమెంటులోచేసిన ప్రకటనను పరిశీలిస్తే, బ్రిటిషువారు మనల్ని పరిపాలిస్తూన్నది ధర్మకర్తృత్వం కొరకో, లేక తమ స్వార్థం కొరకో తెలిసిపోతుంది. బోర్డు ఆఫ్ ట్రేడ్ ఎస్టిమేట్లపై జరిగే చర్చకు జవాబిస్తూ, అతడీవిధంగా పలికాడు :

"ప్రతీవిషయంలోనూ ఇండో-బ్రిటిషు వర్తకపుటొడంబడిక సంతృప్తికరంగా ఉన్నదని నేను భావించను గాని మన యంత్రపరిశ్రమవల్ల తయారయ్యే బట్ట ఇండియా మార్కెటులో పోటీచేయడానికి అనేక సంవత్సరాలనుండి మనకు లేని చక్కని అవకాశం ఇప్పుడు యేర్పడింది."

ఒకవైపున ఇండో-బ్రిటిష్ వర్తకపుటొడంబడికను నిరాకరిస్తూ భారత శాసన సభలో తీర్మానము ప్యాసయింది. మరొకవైపున వైస్రాయి, చక్రవర్తి దానికి తమ ఆమోదాన్ని ప్రకటిస్తూ, శాసనం చేశారు. యీ ఒడంబడిక భారతీయుల ఉపయోగార్థమే చేయబడిందని యింతవరకూ యిండియా ప్రభుత్వ ప్రతినిధులు పలుకుతూ ఉండడం విన్నాంగాని, స్టాన్లీ ప్రభువు పార్లమెంటులో యింత బట్టబయలుగా పలుకుతాడనుకోలేదు. భారతీయులతనికి కృతజ్ఞతావందనములర్పిస్తారు,

దీనికి భారతీయుల సమాధానం ఏమిటి? వర్తకులంతా బ్రిటిషు వస్త్రాలను బహిష్కరించాలి. ప్రజలలో కూడ బహిష్కారాస్త్రం జయప్రదమయ్యేలాగు బ్రహ్మాండమైన ఉద్యమాన్ని లేవదీయాలి. ఇందుకై కాంగ్రెసు ఒక నిర్ణీత కార్యక్రమం యివ్వాలి. త్వరలో జరుగబోయే అ. భా. కాం. కమిటీ సమావేశం అట్టి కార్యక్రమం యిస్తుందని ఆశిస్తున్నాం.

**ప్రస్తుత పరిస్థితులపై మాంచెస్టర్ గార్డియన్ వ్యాఖ్య.**

బ్రిటిషు పారిశ్రామికులు, పెట్టుబడిదార్లు, యీ విధముగా భారత దేశాన్ని ఆర్థికంగా బానిసస్థితిలో ఉంచడానికి నిశ్చయించుకొని యుండగా, రాజకీయంగాకూడ ఫెడరేషన్‌ని మనపై రుద్దడానికి తీవ్రకృషి చేస్తున్నారు. మాంచెస్టర్ గార్డియన్ పత్రిక ఒక సంపాదకీయ వ్యాసంలో యీ విధంగా వ్రాసింది :

"మంత్రి పదవులు స్వీకరించాలని నిర్ణయించిన భారత జాతీయవాదులు సంపూర్ణ స్వాతంత్ర్యాని కది ఒక మెట్టుగా భావించారు. కాని, ఇండియా నేడు సంపూర్ణ స్వాతంత్ర్యానికిగాని, ఫెడరేషన్‌కిగాని, సమీపంలో లేదు."

సంపూర్ణస్వాతంత్ర్యానికీ, మంత్రిపదవులకూ చాలా వ్యత్యాసం ఉన్నమాట వాస్తవమే. కాని, కాంగ్రెసువారు మంత్రిపదవులు స్వీకరించిన తరువాత ప్రజలలో రాజకీయ చైతన్యం, పోరాటశక్తి ఎక్కువయాయని అంగీకరించక తప్పదు. ఇక ఫెడరేషన్ విషయం. ఇండియా నేడు ఫెడరేషనుకు చాలా దూరంగా ఉన్నమాటకూడా వాస్తవమే. కాని, సంస్థానాధీశుల మొండిపట్టుదలయే యిందుకు కారణం అంటుంది మాంచెస్టరు గార్డియన్. బ్రిటిషు ఇండియా రాష్ట్రాలకూ, సంస్థానాలకూ మధ్య గల వైరుధ్యం నశించి, "బ్రిటిషు ఇండియాతో సంస్థానాధీశులకు గల సంబంధాన్ని సరి చేసుకోవా" లని ఆ పత్రిక అభిప్రాయం. అనగా, సంస్థానాధీశులు తమ ప్రజలకు ఏవో కొన్ని సంస్కరణలంటూ యిచ్చి, కాంగ్రెసు నాయకులను సంతృప్తిపరచి, ఫెడరేషను విషయంలో వారితో ఒడంబడిక చేసుకొంటే, బ్రిటిషు ప్రభుత్వం కూడా ఆలోచించి ఒక సమాధానానికి వస్తుందని మాంచెస్టరు గార్డియన్ యొక్క సూచన.

కాని, బ్రిటిష్ ఇండియా ప్రజలు గాని, సంస్థాన ప్రజలు గాని, యీదృక్పథాన్ని అంగీకరించరు. ప్రజా పరిషత్తు సభ ద్వారా తమ రాజ్యాంగాన్ని నిర్ణయించుకొంటామని బ్రిటిషు ఇండియా ప్రజలు లక్నోకాంగ్రెస్ అప్పటినుంచీ తెలియజేస్తూనే ఉన్నారు. ఇక సంస్థాన ప్రజలు సంపూర్ణమైన బాధ్యతాయుత పరిపాలనను ధ్యేయముగా ఉంచుకొని ప్రజా ఉద్యమానికి దిగుతున్నారు. ఇట్టి పరిస్థితులలో కాంగ్రెసు నాయకులు కాంగ్రెసు సంస్థ యొక్క ఆదర్శాన్ని మరువకుండా, సంస్థాన ప్రజల అధోగతిని మనస్సులో ఉంచుకొని కార్యాచరణకు దిగవలసి యుంటుంది. అప్పుడే బ్రిటిష్ పరిపాలకుల కుటిల పన్నాగాలను ఛేదించగలుగుతాము.

**సంస్థాధీశులు-గాంధీజీ**

అయితే సంస్థాన ప్రజా ఉద్యమం విషయములో గాంధీజీ యిటీవల ప్రదర్శిస్తూన్న వైఖరి ఆశాభంగాన్ని కలిగించకమానదు. ప్రతి సంస్థానంలోనూ శాసనోల్లంఘనాన్ని కాల పరిమితి లేకుండా ఆపివేయాలని ఆజ్ఞాపించాడు. సంస్థానాధీశులతో ప్రజాప్రతినిధులు "గౌరవప్రదమైన" రాజీ సంభాషణలు ప్రారంభించాలని కోరాడు. జైళ్ళలో మ్రగ్గుతూన్న సత్యాగ్రహ ఖైదీల కొరకు ఆందోళన పడకూడదని హెచ్చరించాడు. ఆఖరి విషయము, సంస్థాన ప్రజల కనీసపుకోర్కెలను తగ్గించాలని సూచించాడు. ప్రజా ఉద్యమాన్ని ఆపివేసినప్పటినుంచీ తిరువాన్కూరు సంస్థానములో ప్రభుత్వ నిర్బంధ విధానము ఎక్కువ వుందని గాంధీజీ యెదుట తిరువాన్కూరు కాంగ్రెసు నాయకులు మొరపెట్టుకొంటే, "నిర్బంధ విధానాన్నుండి తప్పించుకోవడానికి నేను ఉద్యమాన్ని ఆపివేయమన్నానా?" అని గాంధీజీ జవాబు చెప్పాడు. గాంధీజీ యొక్క ఈ కొత్త పంథా జాతీయోద్యమానికీ, ఫెడరేషన్ ప్రతికూల పోరాటానికీకూడా వినాశకరము.

**సంస్థానాధీశుల సమావేశం**

బొంబాయిలో యీ నెల 10 వ తేదీనుండి వేర్వేరు ప్రాంతాలనుంచి వచ్చిన సంస్థానాధీశులు, వారి మంత్రులు సమావేశమవుతున్నారు. ఫెడరేషన్‌లో సంస్థానాధీశులు చేరడానికి వైస్రాయి గావించిన కొత్త నిబంధనలను (ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఎక్సెషన్) యీ సమావేశములో చర్చించి తమ తుది నిర్ణయాలను తెలియజేస్తారు. నవానగర్ సంస్థానాధీశుడు సమావేశానికి అధ్యక్షత వహిస్తూ, బ్రిటిషు ఇండియా ప్రజలచే కొన్ని సంస్థానాలలో వినాశకరమైన ఉద్యమాలు సాగించబడుతున్నాయనీ, అవి భారతదేశంయొక్క ఐక్యతనూ, అభివృద్ధినీ, భగ్నం చేస్తాయనీ, విలపించాడు. కాని, సంస్థానాలలో ప్రజా శాసనోల్లఘనం నిలిపి వేయబడాలని సూచిస్తూ గాంధీజీ చేసిన ప్రకటన, సంస్థానాల హక్కులు చెక్కుచెదరకుండా కాపాడవలసిన అవసరాన్ని తెలియజేస్తూ సర్ సికందర్‌హయత్‌ఖాన్ (పంజాబు రాష్ట్రీయ కాంగ్రెసు ప్రతికూల ప్రధాన మంత్రి) యిచ్చిన సలహా, సరియైన మార్గానికే దారి తీస్తున్నా"యని నవానగర్ ప్రభువు సంతసము వెలిబుచ్చారు.

కబట్టి, గాంధీజీ సంస్థాన ప్రజా ఉద్యమాన్ని విరమింప జేయడంవల్ల సంస్థానాధీశులలో కొత్త ఆశాలతలు అంకురిస్తున్నాయి. గాంధీజీ ఆశించినట్లు వారి హృదయాలు ఏ మాత్రమూ మార్పుచెందడం లేదు సరికదా, యిదివరకులేని ధైర్యం వారిని ఎక్కువ నిరంకుశులుగా చేస్తోంది.

ఇట్టి పరిస్థితులలో కాంగ్రెసు కర్తవ్యము ఏమిటి? సంస్థానాధీశులు ఫెడరేషన్‌ని అంగీకరిస్తే, బ్రిటిషు ప్రభుత్వం విధిగా భారతీయులమీద ఫెడరేషన్‌ని రుద్దుతుందనీ, బ్రహ్మాండమైన ప్రజా పోరాటం వచ్చినప్పటికీ ఆ విధంగా జరుగుతుందనీ, కేంద్ర శాసన సభ్యుడయిన కె. సంతానంగారు తంజావూర్ రాజకీయ మహాసభలో ఉపన్యసించారు. ఒక వేళ సంస్థానాధీశులు చేరడానికి నిరాకరిస్తే, కేంద్ర శాసనసభను యింకా పొడిగిస్తారనీ, అట్టి సందర్భములోకూడా ప్రజలు పోరాటానికి దిగవలసి వస్తుందనీ, ఆయన చెప్పాడు. ఏది యెట్లున్నప్పటికీ, వచ్చే సంవత్సరములో తప్పక ప్రజా పోరాటము వస్తుందని సంతానంగారు అభిప్రాయమిచ్చారు.

కాంగ్రెసు వర్కింగ్‌కమిటీ ఆ పోరాటానికి ఇప్పటి నుండీ సన్నాహాలు చేయాలని కోరుతున్నాం.



## తప్పటడుగులు! వెక్కిరింతలు!!

ప్రత్యర్థులపై కోపం వెళ్ళగ్రక్కుటలోనో, కోపములో స్థాయిని గోల్పోవుటచేతనో 'మహానాయకులు' బహిరంగోపన్యాసాలలో సైతం నోరు జారుతూవుంటారు. తీరా ఉపన్యాసం ప్రకటించబడిన తరువాత [illegible] ఆతెలివి తక్కువను అంగీకరించడానికి యిష్టం లేక తమ ఉపన్యాసం తప్పు రిపోర్టు చేసారని పత్రికా విలేఖరుల నెత్తిపై యింత దుమ్ము పోసి తప్పించుకొంటారు.

కాంగ్రెసు మంత్రిపదవులు స్వీకరించిన క్రొత్తలో బాటిల్వాలా అరెస్టుపై ప్రజలలో ప్రస్ఫుటిత మవుతున్న అసంతృప్తి, వేయబడుచున్న ప్రశ్నపరంపరలకు గినిసి రాజాజీ, యితర రాష్ట్రీయులు వచ్చి శాంతి భద్రతలకు నష్టం కలిగించుట సహించననీ దౌర్జన్యాన్ని అణచివేయడానికి రివాల్వర్ చేబూనడానికి కూడా జంకననీ అవాకులు చెవాకులు నోరు జారి అన్నాడు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందూ పత్రికలలో ప్రకటించబడిన ఆ ఉపన్యాస రిపోర్టులను గాంచి అవి అబద్ధపు రిపోర్టులనీ, ఒకరినొకరు కాపీ చేసారనీ ప్రకటించి పత్రికావిలేఖరుల నెత్తిపైకి తన నేరాన్ని త్రోసివేసాడు.

పాపం! ఆ విలేఖరులు తమ రిపోర్టుపై రాజాజీతోపాటు ఆ సభలో ఉపన్యసించిన యింకో మంత్రి సంతకము ఉన్నా, మంత్రివర్గంతో పోరాటం యిచ్ఛగించని పత్రికాధిపతులకు జడిసి, తమ ఉద్యోగా లూడతాయనే భీతిచే సత్యాన్ని ప్రకటించి తమ రిపోర్టుల నిజాయతీ రుజువు చేసికోలేకపోయారు.

అవును మరి! ఈ కేపిటలిస్టు సమాజంలో "దొరతనములో దొంగతనములో భాగ్యవంతునకేదైన బాధ లేదు!" అధికారంలో ఉన్నవారేదన్నా త్రోసుకుపోతుంది.

* * *

త్రిపురీకాంగ్రెసులో పంతు తీర్మానానికి మహాత్ముడు ఆమోదం టెలిఫోన్ ద్వారా తెలిపాడనీ, 'కామా'కూడా మార్చకుండా ప్యాసు చేయమన్నాడనీ హేమాహేమీయులయిన గాంధీయులు, ప్రధానమంత్రులు ప్రతినిధుల క్యాంపుల చుట్టూ తిరిగి కాన్వాసు చేసికొన్నారు, కాని గాంధీజీ బోసుకు వ్రాసిన ఉత్తరంలో అలహాబాదులో (అంటే త్రిపురి తరువాత 10 రోజులకు) మొట్టమొదటిసారి పంతు తీర్మానాన్ని చూచానని వ్రాసాడు.

త్రిపురీలో ఓట్లకొరకు కాన్వాసు చేసుకొన్న పెద్ద మనుష్యుల నిజాయితీని శంకించుతామా? అదిగో "మాపై ఏస్పర్షన్సు (నిందలు) వేసావని" వారు ఆక్షేపిస్తారు. గాంధీజీని నమ్ముదామా అంటే మహాత్మునికి ఇద్దరు సెక్రటరీలు ఉన్నారు. ఉపవాసానంతరం గాంధీజీ రాజకోటలో ఉండగా బలహీనతచే తాను చదవలేక పోయినా సెక్రటరీలు చదివి వినిపింపుతారు. పోనీ రాజకోటలో చదవకపోయినా ఢిల్లీలోవుండగా సర్దార్ పటేలు వగయిరాలు కలిసికొన్నారు: అప్పుడయినా తీర్మానాన్ని గురించి చర్చించి వుండాలి. కాని గాంధీజీ అలహాబాద్‌లో అజాద్‌ను చూడటానికి వచ్చినపుడే మొదటిసారి పంత్ తీర్మానాన్ని చూచానంటున్నాడు.

ఏమైనా మహాత్ముని మాటలలోని నిజాయితీని శంకించలేముగదా! 'అవి విశ్వసనీయంగాలేవు' అని అనలేము: అనకూడదు. మహాత్ముల చర్యలవలెనే 'సత్యం' కూడా "అనన్య సామాన్యం, అచింత్య హేతుకము" కాబోలు. ఏమైనా యీ సత్యాన్ని నిర్ణయించడము మాత్రం మనకు అగమ్యగోచరంగావుంది.

* * *

మ॥ రా॥ శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులవారికి రాజాజీవలే పత్రికాధిపతులకు భీతిగొల్పే అధికారమూలేదు. నిజం నిర్ణయించడంలో అడ్డుతగల గలిగిన మహాత్మ్యమూలేదు. అందుచేతనే వారి దబాయింపు వేసవికాలంలో కదల్చివేసిన లోతు లేని నీళ్ళలోని చేపవలె బయట పడిపోయింది ...

ఈనెల ఆరవ తేదీ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంపాదకీయంలో "సామాన్యంగా నమ్మదగిన" ఫ్రీప్రెస్ వార్తలను బట్టి కాంగ్రెసు నిబంధనావళి సవరించుటకు ఏర్పడిన సబ్‌కమిటీలో "జవహర్‌లాలు, నరేంద్రదేవులు కాంగ్రెసులోని కాంగ్రెసు సోషలిస్టువంటి యితరగ్రూపులను బ్లాకులను నిషేధించుటకు సమ్మతించుటలేదు. ఒక నిబంధన ద్వారా తీవ్రవాదులను వెడలగొట్టుటకు సమ్మతించుటలేదు" అని వ్రాసింది. అందులకు తీవ్ర ఆక్షేపణ తెలుపుతూ పట్టాభిగారు సంపాదకునికి వ్రాసిన లేఖలో, నెహ్రూ నరేంద్రదేవులకు, ముసలినాయకులకు తీవ్ర అభిప్రాయ భేదాలుంటాయనడం, సోషలిస్టులను ఇతర రాజకీయగ్రూపులను కాంగ్రెసునుండి తుడిచివేసే సూచనలు వున్నాయనివ్రాసిన ఫ్రీప్రెస్ జర్నలు వ్రాతలు శుద్ధ అబద్ధమన్నారు. ఇట్టి వార్తలు, వీనిపై ఆధారపడి వ్రాసిన వ్యాసాలు ఇదివరకే సున్నితంగా వున్న వివిధ పార్టీల సంబంధాలకు యింకా నష్టం కలిగిస్తాయని వ్రాసారు.

మహాత్ములను శంకింపనట్లే వారి భాష్యకారులను కూడ శంకించరాదని నోరు మూసుకొనేవాణ్ణే. కాని తీరా 10 వ తేదీ పత్రికలు చూస్తే సత్యం బయటపడినది. దురదృష్టవశాత్తు యీసారి 'సత్యం' పత్రికా విలేఖరులవంటి అల్పమానవుల ఆధీనంలో వుండి అసత్యముగా మారిపోవడానికి వీలులేకుండా పోయింది. ఆంధ్ర పార్లమెంటేరియన్ సోదరులు 'మహాత్మునికీ' 'వారి ఆత్మసంరక్షకునికీ' దొరికిన బుకాయింపు ఛాన్సు మా ఆంధ్రుడైన 'వారి భాష్యకారునికి' దొరకలేదని కోప్పడకూడదు మరి

ఏమంటే జవహర్‌లాల్ నెహ్రూ, నరేంద్రదేవ్ గార్లు కాన్స్టిట్యూషన్ సబ్‌కమిటీ సూచనలలో కొన్నిటికి తెలపిన అసమ్మతులు (dissents) కూడ ప్రకటించబడినాయి. వానిలో 5 నిబంధన (సి) లోని "ఏ సాంఘిక సంస్థలలోను సభ్యులుగా వుండరాదు" అనుటకు బదులు "ఏ సాంఘిక మరి యితర సంస్థలలోనూ" అని వుండాలనే గాంధీయుల సూచనకు జవహర్‌లాలు, నరేంద్రదేవులు తమ ప్రకటనలో పూర్తి అసమ్మతి తెలిపారు. అట్టిచో పత్రికల వార్తలు శుద్ధ అబద్ధమనీ ఆసంగతినే చర్చించలేదని అనడం బుకాయింపు గాక మరేమిటి?

మానవుడు తన రహస్యపుకోర్కెలు బయలుపరచ యిష్టపడడు. పరిశోధనచేసి, అన్వేషించి, అక్రమసంఘముగా బ్రిటీషుప్రభుత్వంచే నిషేధించబడిన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడని ఆరోపించి కామ్రేడ్ సుందరయ్య నామినేషన్ రద్దుచేసిన డాక్టరు పట్టాభిగారు త్రిపురీలో "ఇంక సోషలిస్టులను సహించనని" పలికిన సర్దార్ పటేలు, కాంగ్రెసులో మరి యేయితర గ్రూపులు ఉండరాదని సవాలు చేసే కృపాలినీ యీ సూచనకు సుముఖులయినపుడు, "ఏ సాంఘిక మరి ఇతర సంస్థలలోనూ సభ్యులుగా వుండరాదనే" నిబంధన సోషలిస్టులకు, తీవ్రవాదులకు ఉద్దేశింపబడలేదంటే ఏబుద్ధి ఉన్నవాడు నమ్ముతాడు, అందుచే పత్రికలు వ్రాసిన సంగతి పూర్తా సత్యం. గాంధీయులు తీవ్రవాదులను సోషలిస్టులను కొత్త నిబంధన ద్వారా బయటికి నెట్టాలని తలంచుట సంపూర్ణ సత్యం. కాని ఆ కోరికలో కాఠిన్యము తమకే కరకుగా కాన్పించుటచే సూటిగా చెప్ప సాహసించలేకపోతున్నారు. నిజాన్ని బయటపెట్టిన పత్రికలను "సత్యానికి ధర్మకర్తలవలే" తిట్టవేసుకు కూర్చున్న వీరు 'అబద్ధాలు' వ్రాశాయంటున్నారు. అంతే! ఉన్నమాటంటే ఉలుకెక్కువ....

ప్రధాన మంత్రిగారి పార్లమెంటరీ కార్యదర్శి అయ్యదేవర కాళేశ్వరరావుగారు కుప్పం ఉపన్యాసంలో "వివిధ పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ నిరంతరము కాంగ్రెసు ప్రభుత్వాన్ని గురించి హడావుడి గలిగించే విమర్శనలు చేసేవారిని కాంగ్రెసు ప్రభుత్వం అరెస్టు చేసి ఉండవచ్చును. మంచి, బాధ్యతగల ప్రభుత్వము, ముఖ్యంగా, కాంగ్రెసు ప్రభుత్వం దేశంలో సామాన్య శాసనాలకు, శాంతికి భంగం కలుగకుండా చూడాలి." అన్నారని 3 వ తేదీ హిందూ పత్రికలో వుంది. 7 వ తేదీ హిందూ పత్రికలో కాళేశ్వరరావుగారు పైదంతా తన తెలుగు ఉపన్యాసానికి సరియైన అనువాదంకాదని తమ తప్పు పత్రికా విలేఖరి నెత్తిపై రుద్దారు.

వారు యిచ్చిన దిద్దుబాటులో రైతులంతా సకాలానికి రెంటు చెల్లించాలనీ లేనిచో వారి భూములు వేలము వేయబడతాయనీ, తాను చెప్పినటుల స్పష్టపరచారు. అంటే కాళేశ్వరరావుగారు పంపిన సర్దుబాటులోకూడా వెనుకటి శాసనాలన్నీ ఖచ్చితంగా అమలు జరుపుతామనీ, ప్రజలు వానిని పూజించాలనే తెలవిచ్చారు. ప్రజలు కాంగ్రెసు వాదులను ఎన్నుకొని శాసన సభ్యులకు పంపినదీ, కాంగ్రెసు ప్రభుత్వము తమ ప్రభుత్వమని మురిసేదీ, వెనుక బ్రిటీషు సామ్రాజ్యవాదులచే గావించబడిన శాసనాలు—తమను పీడించి, దోపిడిచేసి, పీక్కుతినే శాసనాలు—ముఖ్యంగా అమలు జరపడానికి కాదు. బ్రిటీషు సామ్రాజ్య రక్షణ కేర్పడిన శాంతి, భద్రతలను రక్షించడం కాదు కాంగ్రెసుమంత్రుల పని. వానిని రద్దుచేసి భారతప్రజల రక్షణ కవసరమైన, బ్రిటిషు సామ్రాజ్య దోపిడీ తొలగించే శాసనాలను చేయుటకే కాంగ్రెసువాదులను శాసనసభలకు పంపారు ప్రజలు. ఈసంగతి మరచుట వల్లనే కాళేశ్వరరావుగారు నోరు జారటం, పత్రికా విలేఖరులపై తప్పు వేయచూడడం విఫలులౌటం సంభవిస్తోంది. ప్రజలకు నాయకులకు మధ్య అఘాతం ఏర్పడుతూంది. పత్రికా విలేఖరుల తప్పని దిద్దుటకు ప్రయత్నించి విఫలమయ్యే కంటె తమలోని యీతప్పు దిద్దుకోడానికి ప్రయత్నిస్తే తమ నాయకత్వం నిలిచే ఆశ ఏమైనా వుంటుంది! లేకపోతే....

* * *

ప్రపంచంలో ధర్మరాజుకు "పాపము"—దుర్యోధనునికి "పుణ్యం" ఎంతవెదికినా కాన్పించలేదట. అల్లాగే హిందీ ప్రతికూలవాదులను కాంగ్రెసుప్రభుత్వం విడుదల చేసిన వార్తను 7 వ తేదీ జనవాణి పత్రిక "45 మంది హిందీప్రతికూల ఖైదీల అరెస్టు" అని ప్రకటించింది. ఆవార్తను ఎంత వెదికినా విడుదలే కాని, అరెస్టులు లేవు. ఐతే ప్రతికూల వాదులు అనక "ఖైదీల అరెస్టు" అన్నామని సమర్థించుకోడానికి ప్రయత్నిస్తారేమో! "అరెస్టు" అంటే మానవునికి తిరగడానికి సహజంగా వుండే స్వాతంత్ర్యం తొలగించడం. కాన 'ఖైదీల అరెస్టు' అయితే గియితే 24 గంటలు ఖూనీ కొట్లో (Condemned cell) లాకప్, లేకపోతే నిలువు బేడీలు, అడ్డబేడీలు వేయడము అవుతుంది గాని విడుదల మాత్రం కాదు. హిందీప్రతికూల ఖైదీల విడుదలలోనే అరెస్టుల కలగాంచ గలిగినందులకు, హిందీ ప్రతికూలభావాన్ని లేక కాంగ్రెస్‌ప్రభుత్వంపైగల ద్వేషాన్ని, రుజువు చేసికొన్నందులకు ఆ పత్రికకు మనం అభివందనాలు తెల్పవచ్చు. ఏమంటే ప్రపంచంలో వస్తు సంచయాన్నంతటిని పచ్చగా చూచుటలోనే గదా కామిర్లరోగం యొక్క లోతు రుజువునేది!

# కాంగ్రెసులో ఇతర సంస్థ లేవీ ఉండరాదట!

## నిబంధనావళిలో మార్పులు

## నెహ్రూ, నరేంద్రదేవుల అసమ్మతి

ఈనెల 4, 5, 6 తేదీలలో బొంబాయిలో సమావేశమైన కాంగ్రెసు నిబంధనావళి ఉపసంఘము అ. భా. కాం. కమిటీకి యీక్రింది సిఫార్సులు చేయడానికి నిర్ణయించింది :

1. కాంగ్రెసులో బొంగ సభ్యులు చేరకుండా ఉండడానికి సభ్యత్వము శాశ్వతంగా ఉంచి, పెర్మనెంటు కాంగ్రెసు రిజిస్టరు ఒకటి ఉంచాలి. ఇకముందు నుంచీ, ఎవరైనా ఒక వ్యక్తి ప్రాథమిక కాంగ్రెసు సభ్యుడుగాచేరి, అతనిపేరు కాంగ్రెసు రిజిస్టరులో నమోదు చేయబడితే అట్టి సభ్యుడు ప్రతి సంవత్సరం 4 అణాల వంతున చందాచెల్లిస్తూ రిజిస్టరులో సంతకంకాని, వేలుముద్రగాని, వేస్తూఉంటే ఎల్లకాలం సభ్యుడుగా ఉంటాడు. ఇప్పటి మాదిరిగా అతడు ప్రతిసంవత్సరం సభ్యత్వ ఫారాలను నింపనక్కరలేదు.

2. బర్మా కాంగ్రెసురాష్ట్రాలనుండి వేరు చేయబడాలి.

4. గత 3 సంవత్సరాలుగా కాంగ్రెసు రిజిస్టరులో పేరులేని ఏ సభ్యుడు వెలిగేటుగాగాని, ఏ కాంగ్రెస్ కమిటీకి అధ్యక్ష-కార్యదర్శిగా గాని, ఉండడానికి వీలులేదు.

4. నియోజకవర్గాలు ఇప్పటివలె మాటిమాటికీ మార్పుచెందక, శాశ్వతంగా నిర్ణయింపబడాలి.

5. ఏ నియోజక వర్గంగాని తమకు నియమించబడ్డ సభ్యులసంఖ్యలో కనీసం సగము చేర్పించలేకపోతే ఆనియోజకవర్గం వెలిగేటును ఎన్నుకొనే అర్హత పోతుంది.

6. ఎన్నికల తగాదాను, రిజిస్ట్రేషన్ తగాదాలను పరిష్కరించడానికి ప్రతి రాష్ట్రానికి ఒక్కొక్క రాష్ట్ర ట్రిబ్యునల్ చొప్పున, ప్రతి జిల్లాకు ఒక్కొక్క జిల్లా ట్రిబ్యునల్ చొప్పున స్వతంత్రమైనవి నియమించ బడాలి. నేడు యు. పి. రాష్ట్రంలో పనిచేసే ట్రిబ్యునల్సు మాదిరిగానే యివి ఉండాలి.

7 బొంబాయినగరం, ఢిల్లీ, అజ్మీర్-మార్వార్-యీ మూడురాష్ట్రాలు చిన్న రాష్ట్రాలనీ, మిగిలినవన్నీ పెద్ద రాష్ట్రాలనీ, విభజింపబడి, పెద్ద రాష్ట్రాల రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులలో మూడవ వంతు సభ్యుల్ని మాత్రమే యిప్పటిమాదిరిగా "సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటింగు" పద్ధతి ప్రకారం అ॥ భా॥ కాం॥ కమిటీ సభ్యుల్ని ఎన్నుకోవాలి. ఈ ఎన్నిక ప్రతి రాష్ట్ర కాంగ్రెసుకమిటీ సమావేశంలో జరుగుతుంది ఇక మిగిలిన శ్రేవంతు సభ్యుల ఎన్నిక విషయం. అ॥ భా॥ కాం॥ కమిటీ సభ్యుల ఎన్నికకై ప్రతిరాష్ట్రకమిటీని కొన్ని ప్రాంతీయ నియోజక వర్గాలుగా విడదీసి, ఒక్కొక్క నియోజకవర్గము కొంతమంది అ॥ భా॥ కాం॥ కమిటీ సభ్యుల్ని ఎన్నుకోవాలి. అయితే ఎన్నిక విధానం మాత్రం 'సింగిల్ డిస్ట్రిబ్యుటివ్ వోటింగు" పద్ధతిద్వారా జరుగుతుంది. (మెజారిటీ సభ్యులు ఎవరికి ఎక్కువ ఓట్లు యిస్తారో వారు ఎన్నుకోబడతారు)

బొంబాయి నగరం, ఢిల్లీ, అజ్మీర్-మార్వార్ రాష్ట్రాలలో మాత్రం అ॥ భా॥ కాం॥ కమిటీ సభ్యుల ఎన్నిక ఇప్పటి మాదిరిగానే "సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటింగు" పద్ధతి ప్రకారమే జరుగుతుంది.

8. కాంగ్రెసు కార్యవిధానానికి విరుద్ధముగా నడిచే సంస్థలో సభ్యుడుగా ఉన్న వ్యక్తి కాంగ్రెసు కమిటీలలో ఉండకూడదు. నేటి కాంగ్రెస్ నిబంధనావళి 5 వ ఆర్టికల్ "సి" క్లాజులో యీ క్రింది విధంగా ఉంది.

"ఏదైన ఒక సాంఘిక (కమ్యూనల్) సంస్థయొక్క ఆదర్శం, లేక కార్యక్రమం, రాజకీయంగా జాతీయ ప్రతికూలమైనట్టిగాని, కాంగ్రెసుకు వ్యతిరేకమైనట్టిగాని, పనులకు దారితీస్తుందని వర్కింగ్ కమిటీవారు భావిస్తే, అట్టి సంస్థ తాలూకు కమిటీలో సభ్యుడుగాఉన్న ఏవ్యక్తి కాంగ్రెసు కమిటీలలో సభ్యుడుగా ఉండకూడదు."

ఈ నిబంధన నేడు యీక్రింది విధముగా మార్పు చేయబడాలని ఉపసంఘంవారు సూచించారు :

"ఏదైన సాంఘిక (కమ్యూనల్) సంస్థయొక్క లేక ఏయితర సంస్థయొక్క, ఆదర్శం లేక కార్యక్రమం, రాజకీయంగా జాతీయ ప్రతికూలమైనట్టిగాని, కాంగ్రెసుకు వ్యతిరేకమైనట్టిగాని, పనులకు దారితీస్తుందని వర్కింగ్ కమిటీవారు భావిస్తే, అట్టి సంస్థలో సభ్యుడుగా ఉన్న ఏవ్యక్తి కాంగ్రెసు కమిటీలకు అధ్యక్ష కార్యదర్శిగాగాని, సభ్యుడుగాగాని, ఎన్నుకొనబడుటకు అర్హత ఉండదు.''

* * *

## జవహర్లాల్ అసమ్మతి

తుది మార్పుయెడల తన అసమ్మతిని ప్రకటిస్తూ ఉపసంఘ సభ్యులలో ఒకడైన జవహర్లాల్ నెహ్రూ యీ క్రింది విధంగా తెలియజేశాడు :

"5 వ ఆర్టికల్ క్లాజు 'సి'లో, "సాంఘిక సంస్థయొక్క'' అనే శబ్దాల తరువాత "లేక ఏయితర సంస్థయొక్క'' అనేశబ్దాలు చేర్చాలని సిఫార్సు చేయబడింది. క్లాజుయొక్క అర్థం యీవిధంగా విశాలపరచబడింది. కొత్తగా చేర్చబడ్డ యీభాగం కొంతవరకు దుర్వినియోగము కావడానికి అవకాశము ఏర్పడుతుంది. కాబట్టి యీమార్పుకు నేను అంగీకరించడానికి సందేహించాను. ఒక సంస్థయొక్క ఆదర్శానికి గాని, కార్యక్రమానికిగాని, భిన్నంగా వ్యవహరించే వ్యక్తుల్ని ఆసంస్థ తాలూకు కమిటీలలో ఉండకుండా నిషేధించే అధికారం అవసరం అనడంలో ఎట్టి సందేహమూ ఉండకూడదు. వ్యక్తులకే కాకుండా, ఇతర సంస్థలకు కూడా యీ నిబంధనను వర్తింపచేయుట అవసరం కావచ్చుకూడ. ఇట్టి అధికారం సహజంగా ఏసంస్థకైనా ఉంటుందని నా అభిప్రాయం. నిబంధనావళిలో యీ విషయం స్పష్టీకరించి వ్రాయబడకపోయినా, ఆ అధికారం కాంగ్రెసుకు యిప్పుడు ఉంది. నేడు ఇండియాలో వినాశకరమైన శక్తులెన్నో ఉన్నాయి. వాటిని అరికట్టకపోతే, కాంగ్రెసు సంస్థ బలహీనమైపోతుంది. కాబట్టి, హేతువాదాన్ని పురస్కరించుకొని ఆలోచిస్తే, ఈ కొత్త నిబంధన యెందుకు తేబడిందో అర్థం చేసుకొన్నాను' కాని నేటి పరిస్థితుల్ని దృష్టిలోపెట్టుకొని ఆలోచిస్తే, యీ మార్పును మరొకవిధంగా అర్థం చేసుకోవడానికి అవకాశము ఏర్పడుతోంది. ఫలితంకూడా తప్పుడు ఫలితం కలుగుతుంది. చర్య తీసుకోవడం అవసరమైనప్పుడు తప్పు చేసిన వ్యక్తులమీదనే తీసుకోవాలని నా అభిప్రాయం. తీసుకోవడంలో అనుమానించకుండా తీసుకోవాలి. కొన్ని అసాధారణ పరిస్థితులలో సంస్థలమీద కూడా చర్య తీసుకోవడం తప్పనిసరి కావచ్చు కాని, సాధ్యమైనంతవరకు అట్టిది జరగకుండా చూడాలి. ఏది యెట్లున్నప్పటికీ, అభిప్రాయాలను కలిగి యుండడం శిక్షార్హం అనేభావం ప్రజలలో కలగకూడదు.''

నెహ్రూ

నరేంద్రదేవు

## నరేంద్రదేవు అసమ్మతి

నిబంధనావళి మార్పుల ఉపసంఘములో మరొక సభ్యుడైన ఆచార్య నరేంద్రదేవు ఈ క్రింది విధంగా తన అసమ్మతిని తెలియజేశాడు :

"నిబంధనావళియొక్క ఆర్టికల్ క్లాజు "సి" లో 'సాంఘిక సంస్థయొక్క' అనే శబ్దాల తరువాత 'లేక యితర సంస్థలయొక్క' అనే శబ్దాలు చేర్చాలని సూచించబడింది పైకి మాత్రం యీ మార్పు అంగీకరించబడవచ్చునని తోస్తుంది. కాని యీ మాటలు కొత్తగా చేర్చబడటానికి సరియైన కారణం ఏదీ లేదని నా అభిప్రాయం. ఈ కొత్త శబ్దాలతోకూడిన క్లాజు దుర్వినియోగపడడానికి ఎంతో అవకాశం ఉంది. ఎందువలనంటే వర్కింగు కమిటీవారు వర్గ సంస్థలనూ (కూలీ సంఘాలు, రైతు సంఘాలు) కాంగ్రెసులో ఉన్న రాజకీయ పార్టీలను, ముఠాలను, నిషేధించడానికి విశేషమైన అధికారం యివ్వబడుతోంది. ఆ విధంగా చేసి తీరాలని కొందరు కోరుతూ వచ్చారు కూడా. వారి కోరికను చెల్లించడానికి యీ మార్పు చేయబడుతోందని ఊహించడానికి అవకాశం ఉంది. జాతీయ ప్రతికూల సంస్థలనూ, కాంగ్రెసుకు భిన్నమైన ఆదర్శాలు లేక కార్యక్రమం ఉన్న సంస్థలనూ, నిషేధించడానికి కాంగ్రెసుకు అధికారం ఉన్నమాట నిస్సందేహం. అట్టి కేసులు నిర్ధారణ అయినప్పుడు ఆ అధికారాన్ని వినియోగించవచ్చుకూడ. కాంగ్రెసుఆదర్శానికే, కార్యక్రమానికే విరుద్ధంగా ప్రవర్తించే కాంగ్రెస్ సభ్యుల మీద రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలు డిసిప్లినరీ చర్యలు తీసుకొనవచ్చు. కాని కాంగ్రెసుచే అంగీకరించబడిన రాజకీయ ఆదర్శాన్నే కలిగి యుంటూ, ఆర్థిక కార్యక్రమం విషయములో మాత్రం తాత్కాలికంగా కాంగ్రెసుతో కలియకుండా ఉండేవర్గసంస్థలలో కాంగ్రెసువాదులు పాల్గొనకుండా నిషేధించడం ఏమాత్రమూ తగినపని కాదు.

"మార్పు చేయబడిన యీ క్లాజును పురస్కరించుకొని, అట్టి వర్గసంస్థలమీద చర్య తీసుకొంటే, అతి వినాశకరమైన పరిస్థితులేర్పడతాయని నా అభిప్రాయం. కాంగ్రెసువాదులలో కలహాలు, అనఖ్యత ఏర్పడటమే కాకుండా ఇతర సామ్రాజ్యవ్యతిరేక సంస్థలు కాంగ్రెసునుండి వేరైపోవడం తటస్థిస్తుంది."

---

ఏలూరు తాలూకా

### రైతు-కూలీ సమ్మేళన మహాసభ.

17-6-39 శనివారం ఉదయం 9 గంటలకు పాలగూడెంలో కామ్రేడ్ కె. డేనియల్‌స్మిత్‌గారి అధిపత్యమున బహిరంగసభ జరుగును. శ్రీ కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారు సభను ప్రారంభింతురు. శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణగారు జెండా ప్రతిష్ఠ జరిపెదరు.

ఉపన్యాసకులు : కామ్రేడ్స్ పేటేటి వెంకటరత్నం, గారపాటి సత్యన్నారాయణ, కన్లెం రామస్వామి, దాసరి వెంకట్రావు, మాతంగి లక్ష్మయ్యగార్లు

షరా:—28-3-39 తేదీన కైకరం, జిల్లా వ్యవసాయ - కూలీ సభలో ఎన్నుకొనబడిన కార్యవర్గమునకు, అధ్యక్ష, కార్యదర్శులను ఎన్నుకొనుట.

ఆహ్వాన సంఘ సభ్యులు.



# కాంగ్రెసులోని క్లిష్టత మరింత హెచ్చింది!

## త్రిపురీ-కలకత్తా సమావేశాల సింహావలోకనం!

[కమ్యూనిస్టు పత్రిక 'న్యూఏజ్' సంపాదకీయం]

గాంధీయుల అభీష్టానికి వ్యతిరేకంగా ఎన్నికలో నిలబడి బోసు అధ్యక్షునిగా ఎన్నుకోబడిన జనవరి 29 వ తేదీ అనంతరం, భారత రాజకీయ జీవితంలో ఒకదానివెంట నొకటిగా అనేక ఘటనలు జరిగి, నేడు మనము గభీరము క్లిష్టము అయిన పరిస్థితుల నెదుర్కొవలసి వచ్చాము. ఏపక్షానికి జెందిన కాంగ్రెసువాది అయినా, నేడు దూరంగా కూర్చొని యీ వివాదాలు వాటంతట అవే సర్దుకొంటాయనీ యిప్పటి దిగజారుడు విధానంబోయి జాతీయ పోరాటానికి ఆజ్ఞ యివ్వబడుతుందని ఆశించలేడు. అట్టి ఆశలకు పునాది సంపూర్ణముగా భగ్నమైపోయింది. జాతీయ మహాసభలో చీలికలు పోవాలంటే, రానున్న ప్రపంచ సంగ్రామ సమయానికి సిద్ధమై కాంగ్రెసు చరిత్రాత్మకమగు తన సంపూర్ణ స్వాతంత్ర్య గమ్యస్థానం చేరాలంటే, మనల నెదుర్కొనుచున్న పరిస్థితుల గమనించి ప్రస్తుతం మన బలహీనతకు కారణాలు తొలగించివేయాలి....

### యుద్ధమేఘాలు

స్పెయిన్ స్వాతంత్ర్యం హరించడానికి, జకోస్లొవేకియా ఆక్రమణకు బ్రిటీషు సామ్రాజ్యవాదం తోడ్పడి, మధ్య, దక్షిణ యూరపులలో జర్మనీ, ఇటలీల బలాన్ని వృద్ధిచేసింది. అందుచే యుద్ధానికి అవకాశాలు నేడు మరీ ఎక్కువయ్యాయి. ఆయుధనిర్మాణంలో పోటీ అంతిమ స్థాయికి వచ్చింది. స్టాలిన్ చెప్పినట్టుల రెండవ సామ్రాజ్యయుద్ధం యిదివరకే ప్రారంభమయినది. అది ప్రపంచ సంగ్రామంగా మారడానికి ఎంతోకాలం పట్టదు.

### ప్రధాన సమస్య

తరుముకొని వస్తున్న యీ యుద్ధ పరిస్థితులలో కాంగ్రెసు నాయకత్వం అవలంబించుతున్న వినాశకరమైన దిగజారుడు విధానం ఎంతో అపాయకరమైంది నాయకత్వం ప్రజలు కోరుతున్న పోరాటానికి యిష్టపడుటలేదు. యిప్పటి విధానమే కొనసాగుచో కాంగ్రెసులో చీలికలువచ్చి రానున్న పోరాటానికి మనం తయారుకాలేము. కాంగ్రెసులో ఐక్యత సాధించి పోరాటానికి ప్రజలను సన్నిద్ధముచేయుటే నేడు మనల నెదుర్కొనుచున్న ప్రధానసమస్య.

ఇంతటి క్లిష్ట పరిస్థితుల, ఇంత మంచి అవకాశము యింతకుముందు మనకు తటస్థించలేదు. ఐక్యతను సాధించి పోరాడితిమా సంపూర్ణ విజయానికి అవకాశముంది. లేనిచో పరాజయం, సర్వనాశనం మనకు ప్రత్యక్షము, మన ప్రయత్నాలు ఫలించి, మన బానిసత్వాన్ని నాశనం గావించడమా లేక యీ మహదవకాశాన్ని జారవిడచి బానిసత్వంలోనే మ్రగ్గడమా అనేది నేడు మనం అవలంబించు రాజనీతిపై ఆధారపడి ఉంటుంది.

### సామ్రాజ్యవాదుల ఎత్తు.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు భారతదేశం విషయమై అవలంబించు రాజకీయ యెత్తులను పరిశీలించియే మన విధానం నిర్ణయించాలి. యుద్ధ ప్రయత్నాలు మూలంగా తమకు వచ్చిన భారాన్ని భారతీయుల నెత్తిని మోప జూస్తున్నారు సామ్రాజ్యవాదులు. ఇండో-బ్రిటిషు వర్తక సంధి ఢిల్లీ అసెంబ్లీ నిరాకరించినా అమలు జరపడం, దూదిపై దిగుమతి సుంకం విధించడం, భారత పరిశ్రమలకు రక్షణ యివ్వ నిరాకరించడం కొన్ని ఉదాహరణలు. వీనితోపాటు ఫెడరేషనుకు సంస్థానాధిపతుల అంగీకారాన్ని సంపాదించడానికి వారికి రిక్షణలను ఎక్కువ జేస్తున్నారు. రాష్ట్రమంత్రులకు యిపుడున్న స్వల్ప అధికారాలను కూడ బ్రిటిషు యుద్ధ యంత్రానికి అడ్డురాకుండా ఇండియా ఆక్టు సవరణద్వారా తగ్గిస్తున్నారు. భారత సైన్యాన్ని పునర్నిర్మించడం, ఆయుధ ఫ్యాక్టరీలను భారతదేశంలో నిర్మించడం, ఆశియా ఖండంలో యుద్ధకేంద్రంగా బ్రిటను భారతదేశాన్ని వినియోగించుకొనుటకే. ఈ ప్రయత్నాలన్నిటి ద్వారా రాజకీయ, ఆర్థిక రంగాలలో భారత ప్రజాహక్కులపై సామ్రాజ్యవాదుల దాడి ప్రారంభమయింది.

యుద్ధ సమయంలో బ్రిటిషు సామ్రాజ్యవాదులకు భారతదేశ సహకారం అత్యంత అవసరం. యుద్ధ అవసరాలవలన సామ్రాజ్యవాదము భారత జాతీయ సత్వాలకు నష్టం కలిగిస్తోంది. అదే కారణంచేత సామ్రాజ్యవాదం భారత సహకారం కోసం రాజీ పడాలి కాని జాతీయవాదులలో ఏ వర్గానికి కూడ సంతృప్తి నిచ్చు కనీస రాజకీయ ఆర్థిక సంస్కరణలు సామ్రాజ్యవాదం నేడు యివ్వలేదు. యివ్వదు. అంటే సామ్రాజ్యవాదం కాంగ్రెసు నాయకులతో రాజీకోరుతుంది కాని తాను ఏమీ చేయిజారకుండా మాత్రమే. తన నిరంకుశాధికారాలను వదలుకోదు. బ్రిటిషు ధనస్వాముల దోపిడీ విధానం యిల్లాగే కొనసాగాలి; తన ప్రాపకంలో వున్న సంస్థానాధీశులు యితర జాతీయ విద్రోహులకు ఏమీ నష్టం కలుగరాదు.

### నేర్చుకోవలసిన పాఠం.

మన జాతీయ నాయకులు నేడు అవలంబించుచున్న పంథా సామ్రాజ్యవాదులు భారతదేశాన్ని యుద్ధంలోకి లాగడానికి వేసే యెత్తులను అరికట్టకలుగుతుందా? సామ్రాజ్యవాదులు నేడు ఏమీ సంస్కరణలు యివ్వరనియు, తమకు అండయైన నరేంద్రులు వగైరా జాతీయ విద్రోహులకు విరుద్ధంగా ఏమీ చేయరనీ, ప్రజలకు ఎట్టి సౌకర్యాలు ప్రసాదించరనీ, సాంఘిక తగాదాలను ప్రోత్సహించడం మానరనీ నాయకులు గ్రహించారా? గ్రహించి క్రమక్రమంగా అధికారం భారతీయుల హస్తగతమవుతుందనే ఆశ వీడి, జాతీయ పోరాటానికి సన్నిద్ధులవుతున్నారా?

కాంగ్రెసు నాయకత్వం యీ సత్యాలను గ్రహించినట్లయితే గత సంవత్సర చరిత్ర, అధ్యక్షుని ఎన్నికానంతర సంఘటనలు వేరువిధంగా వుండేవి. సంస్థాన ప్రజా ఉద్యమం బలపరుపబడేది, కాంగ్రెసులో సంపూర్ణ ఐక్యత సాధింపబడేది, రానున్న యుద్ధ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకో గల శక్తిని కాంగ్రెసు సంపాదించేది.

### త్రిపురీ—కలకత్తా

కాని అలా జరుగలేదు. సుభాసుబోసు విజయంతో గాంధీజీ 'అదినా ఓటమి' అని ప్రకటించాడు. వర్కింగు కమిటీ సభ్యులు రాజీనామా యిచ్చారు. కాంగ్రెస్ సామాన్యసభ్యులు దిగుజారుడు పాలసీకి వ్యతిరేకంగా, అహింసా సత్యాలపేర కార్మిక కర్షక పోరాటాలను అణచివేయడానికి వ్యతిరేకంగా, బోసును ఎన్నుకొన్నారు: అంతేగాని కాంగ్రెసు ప్రధాన సూత్రాలను, గాంధీజీ నాయకత్వాన్ని త్రోసి రాజన్నారనుట సరికాదు. ప్రత్యామ్నాయ నాయకత్వం కావాలనే కొందరి తీవ్రవాదుల నినాదాలు సాకుగా తీసుకొని మితవాదులు రాజకీయ నిర్మాణసమస్యలను నుండి కాంగ్రెసు మహాసభ దృష్టిని మరల్చి గాంధీజీ లేక బోసు నాయకత్వమా అను సమస్యను పైకితెచ్చారు: కాంగ్రెసు నాయకత్వం ఒకే ముఠాచేతిలో వుండాలన్నారు.

కలకత్తాలో జరిగింది ఒక ఆకస్మిక ఘటన కాదు; ఒకరినొకరు అర్థం చేసికోపోడము మాత్రమేకాదు. మితవాద నాయకులు ఒక పక్షంవారే వర్కింగు కమిటీలో వుండాలని పట్టుదల పెంకితనం వహించుట, కొందరు కామ్రేడ్సు తలంచునటుల కేవలం ప్రతిష్ఠ కొరకు మాత్రమేకాదు. సుభాస్‌బోసు, నెహ్రూ, జయప్రకాశ్ వగైరా తీవ్రవాదులలో ఎక్కువ భాగం సంయుక్త వర్కింగు కమిటీని కోరడం ఎక్కువమంది తీవ్రవాదులు వర్కింగు కమిటీలో వుండుటకు మాత్రమేకాదు. కారణాలు యింకా గంభీరమైనవి.

### రాజకీయ కారణాలు

రెండూ రెండు విలక్షణమైన పంథాలు త్రిపురీలోను కలకత్తాలోను స్పష్టంగా గోచరించాయి. కాంగ్రెసు నాయకత్వంలో బలీయమైన కక్ష అయిన గాంధీయులు ఒకే ముఠాయే వర్కింగు కమిటీలో వుండాలనడం, నెహ్రూ బోసులు సంయుక్త వర్కింగుకమిటీ వుండాలనడం, వారికి వీరికి కాంగ్రెసు ఐక్యతను గురించి రెండు ప్రత్యేక దృక్పథాలుండుటను బట్టియే నెహ్రూ, బోసులు పోరాటానికి, పోరాటం ప్రారంభించడానికి ఐక్యత కావాలంటున్నారు మితవాదులు వేరొకరకమైన ఐక్యత కోరుతున్నారు.

### పోరాటం లేకుండా అధికారం.

మితవాదులు పోరాటంయొక్క ఆవశ్యకతనే గుర్తించుటలేదు. అధికారం క్రమంగా పోరాటం లేకుండానే భారతీయుల హస్తగతం అవుతుందని ఆశించుతున్నారు. వారి దృక్పథం కలకత్తా సభ తరువాత ఒసంగిన ఉపన్యాసంలో సర్దార్ పటేల్ వెల్లడిచేసాడు.

"అపనమ్మకం, సామరస్యం లేక పోవడం, మన చేతగానితనాన్ని రుజువుచేస్తుంది. అందుచేతనే మహాత్ముడు కాంగ్రెస్ వర్కింగు కమిటీలో ఒకే అభిప్రాయం వుండాలి అని అంటున్నాడు."

"మన యంత్రాన్ని సరియైన మార్గంలో నడిపితే పోరాటంకూడా లేకుండానే అధికారం స్వాధీనం చేసికోగలం"

మితవాద తత్వంయొక్క హృదయం యీ మాటలలో సంపూర్ణముగా బయటపడింది. 'హోమోజీనియస్' వర్కింగు కమిటీ (ఒకే ముఠా వుండాలనడం)లోని మూలతత్వానికి రాజకీయ కారణం బయటపడింది. రానున్న యుద్ధ పరిస్థితులు, భారతదేశాన్ని యుద్ధంలోకి లాగడానికి బ్రిటన్ ప్రయత్నాలు జరుపుతున్న యీ సమయంలో 'పోరాటం లేకుండా అధికారం' (స్వరాజ్యం) అంటే సామ్రాజ్యవాదముతో రాజీయే. ఈ రాజీ విధానాన్ని కొనసాగించడానికే మితవాదులు వర్కింగు కమిటీలో ఒక ముఠాయే (గాంధీయులు మాత్రమే) వుండాలని కోరుతున్నారు ఈ ఉద్దేశ్యంతోనే మితవాదులు త్రిపురీ కలకత్తాలలో పనిచేసారు. సంపూర్ణంగా గాంధీయుల వర్కింగు కమిటీ ఏర్పడింది. ఎన్నికలో జయమొందిన బోసు రాజీనామా యివ్వాలిసి వచ్చింది. కాంగ్రెసు నాయకత్వం అఖిలభారత జాతీయ పోరాటాన్ని జాతీయ వాంఛా తీర్మానం ప్రకారము నడపడానికిగాక బ్రిటీషు సామ్రాజ్యంతో బేరమాడటానికి పూనుకొంటుంది. అంటే ప్రస్తుతం జరిగే పోరాటాలు కూడా ఆపివేయాలంటుంది యీ పాలసీ. అట్టియెడ కలకత్తా ఫలితం సామ్రాజ్యవాద పత్రికలకు, బీహార్, యు. పి. జమీందారులకు సంతోషకారణ మవడంలో ఆశ్చర్యమేముంది?

### సంస్థాన ప్రజాపోరాటాలను ఆపుచేయుట.

మితవాదుల ఈపంథా ఫలిత మేమిటో సంస్థాన పోరాటాలగతిని గమనించితే తెలుస్తుంది. 1938 లో సంస్థానాలలోని 8 కోట్ల భారతప్రజలు రాజకీయ రంగంలోకి వచ్చారు. బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రధాన ఆశ్రయమైన సంస్థానాల పునాదులు పూగిసలాడాయి. ఇదివరకు కని విని యెరుగనంతటి విశాల భారత జాతీయ పోరాటానికి అవకాశ మేర్పడింది. కాశ్మీర్, తిరువాన్కూరు, ఢెంకనాల్ వగైరా అనేక సంస్థానాలలో ప్రజాపోరాటపు తుపాను లేచింది. రాజకోట జైపూర్ పోరాటాలు ప్రారంభమైనపుడు భారత జాతిఅంతా పోరాటానికి ఆజ్ఞకొరకు నిరీక్షిస్తోంది. దిగజారుడు పాలసీ అంతమొందు తుందనీ, కాంగ్రెసు శక్తి బ్రిటీషు సామ్రాజ్యానిక వ్యతిరేకంగా వినియోగింప బడుతుందనీ ఆశించారు.

పిమ్మట వరుసగా గాంధీజీ ఉపవాసం, వైస్రాయి వాగ్దానం, నరేంద్రులకు 'యిండ్లు సర్దుకోమని' సలహా, గాంధీజీ సంస్థానపోరాటాలు ఆపివేయించడం జరిగాయి. ప్రజా ఉద్యమం బలపడి నరేంద్రులు చిక్కులో వున్నపుడు గాంధీజీ ఉద్యము ఆపివేసాడు. ఇందులకు చెప్పిన కారణమేమిటంటే, "నరేంద్రులు ప్రజా ఉద్యమం వలన ఆందోళన పడుతున్నారనీ వారికి వైస్రాయి యిచ్చిన సలహా అమలు జరుపడానికి అవకాశం యివ్వాలనీ".

### దాని ఫలితము,

తీవ్రంగా కొనసాగుతున్న ప్రజా ఉద్యమాన్ని ఆపివేయడాన్ని నరేంద్రులు ఎలా ఉపయ

యోగించుకొన్నారో చూదాం. ఉద్యమ ఒత్తిడి తగ్గుటతోనే మత సాంఘిక కలహాలు రెచ్చగొట్టారు. నిర్బంధాలు ఎక్కువచేసారు. రామదుర్గ్, గంగ్‌పూర్‌లలో ప్రజలపై కాల్పులు జరిగాయి. కచ్‌లో జాతీయపతాకం తగులబెట్టబడింది. లింబ్డీ సంస్థానం నుండి వేలకొలది ప్రజలు బాధలు భరించలేక పారిపోయారు. తిరువాన్కూర్, జైపూర్‌లలో ప్రజాసభలు, ఉత్సవాలను భగ్నపరచటానికి రౌడీలను వినియోగించారు. అన్నిటికి మించినది రాజకోటలో గాంధీజీ ఓడించబడ్డాడు. ప్రజా పోరాటం పుంతగా జంకిన వీరవల్లా విజృంభించి సాంఘిక ద్వేషాన్ని రెచ్చగొట్టి గ్వయర్ తీర్పునే వినియోగించి గాంధీజీని ఓడించాడు.

సంస్థానాధీశుల యీ దాడిముందు కాంగ్రెస్ నాయకత్వం యింకా వెనుక అడుగువేయ ప్రారంభించింది. అందుబాటులో వున్న జయం అపజయంగా మారిపోయింది. అపజయాన్ని 'హృదయ పరివర్తనం', 'సత్యం. అహింస' అను వేదాంతపు మాటలలో కప్పిపుచ్చారు. దిగజారుడు (రాజీ) విధానం దాని సహజ ఫలితాన్నే పొందింది. మహానాయకుడు ఓడిపోయి అల్పుడైన నరేంద్రునికి వినమ్రుడయ్యాడు.

ప్రతీఘాతకుల విజృంభణ.

అంతేగాదు. బెంగాలులో రాజకీయ ఖైదీల విడుదలకొరకు రాయబారాల ద్వారా మహాత్ముని ప్రయత్నాలు విఫలమయ్యాయి. పంజాబులో భూమిశిస్తును హెచ్చించినందులకు ఆందోళన గావించుతున్న రైతులు వందలకొలది జైలుకు పంపబడుతున్నారు. బెంగాలులో 'హక్' మంత్రివర్గం మ్యునిసిపల్ అమెండుమెంటు బిల్లు ప్రవేశపెట్టి మతకలహాలను రెచ్చగొట్టుతూంది. సంయుక్తరాష్ట్రాలు, బీహారు, బొంబాయి వగైరా కాంగ్రెసు మంత్రులున్న రాష్ట్రాలలో మత కలహాలు విజృంభించాయి. బొంబాయి, కాన్పూరు మిల్లు యజమానులు కాంగ్రెసు మంత్రులు యిచ్చిన స్వల్ప హెచ్చు వేతనాలు యివ్వ నిరాకరించుతున్నారు. 'డిగ్బాయి' సమ్మెదారులపై జరిగిన కాల్పులను అస్సాం కాంగ్రెసు వాదులందరు తీవ్రంగా నిరశించినా మేజిస్ట్రేటు సమర్థించాడు. కాంగ్రెసు మంత్రుల రాజీప్రయత్నాలన్నిటిని యూరోపియన్ యజమానులు భగ్నపరచారు. సరిహద్దు రాష్ట్రంలో వందలకొలది రైతులు జమీందారులచే తమ భూమి నుండి తొలగించబడుతూ కాంగ్రెస్ ప్రభుత్వంచే అరెస్టు చేయబడుతున్నారు. ప్రధాన మంత్రి కొడుకు 'ఒబైదుల్లా' వగైరా కాంగ్రెసువాదులు జైలుకంపబడి కాంగ్రెసు సంఘాలలో పదవుల నుండి తొలగించబడ్డారు.

సంస్థానాలలో వలెనే. అధికారులదాడిని ఎదుర్కొనడానికి ప్రజా ఉద్యమాన్ని కాంగ్రెసు నాయకత్వం ప్రోత్సహించుటలేదు. ప్రతిచోట వారి విధానం పోరాటాన్ని అపివేయడమే. వీరు కాంగ్రెసును శుద్ధిపరచుట అనే పేరుతో తీవ్రవాదులను వెడలగొట్టుట వారి రాజీ విధానంలో ఒకభాగం.

హోమోజీనియస్ వర్కింగ్ కమిటీతోపాటు అఖిలభారత కాంగ్రెస్ కమిటీని ప్రస్తుత నాయకత్వాన్ని బలపరచే వారితో నింపాలి. వివిధ పక్షాల ప్రాతినిధ్యమిచ్చే ప్రొపోర్షనల్ ప్రాతినిధ్యం తొలగించాలి. సామాన్య కాంగ్రెసు సభ్యుల అసంతృప్తి వైకిరాకుండా కాంగ్రెసులోని ప్రజాస్వామిక సూత్రాలను తొలగించి, డిసిప్లినరీ చర్యలద్వారా అణచివేయాలి. మితవాదులు కాంగ్రెసు నిబంధనావళిలో సూచించే మార్పులకు అర్థమదే.

ఫార్వర్డ్ బ్లాక్

తీవ్రవాదులు కాంగ్రెసులోని అధిక సంఖ్యాకులను పోరాటానికి అనుకూలంగా మార్చలేకపోయారు: మితవాదుల ప్రతీఘాతక ప్రయత్నాన్ని అరికట్టలేకపోయారు. అందుచే 'గాంధీతత్వం పోవాలి' 'నూతన నాయకత్వం కావాలి' అనే నినాదాలతో కొందరు రాజకీయ సాహసికులు నాయకత్వంపైవున్న అసంతృప్తిని వినియోగించుకో పూనుకొన్నారు.

తీవ్రంగా ఎదుర్కొంటున్న యుద్ధపరిస్థితులు నిర్బంధ విధాన విజృంభణ. నాయకుల దిగజారుడు విధానం. తీవ్రవాదులపై గాంధీయుల విజృంభణ. రాజకీయ సాహసికుల 'మరో నాయకత్వ నినాదం' ఇవే కలకత్తా తరువాత గమనించవలసిన సంగతులు. సుభాస్‌బోసు నాయకత్వాన స్థాపించబడిన ఫార్వర్డు బ్లాక్ ప్రధానమైనది. ఇది వెనుకటి అధ్యక్షునిచే నడపబడుచున్న నాయకత్వంపై అసంతృప్తి జెందిన కాంగ్రెసులోని తీవ్రవాదుల ముఠా. దీనిని అపుడే చాలమంది తీవ్రవాదులు ఖర్షించారు. పంజాబు, సంయుక్త రాష్ట్రాలలో శాఖలను నిర్మించడానికి ప్రయత్నాలు జరిగాయి. ఫార్వర్డుబ్లాకు ఉద్దేశ్యాలలో "ప్రస్తుతమున్న కాంగ్రెసు కార్యక్రమాన్ని ఆచరణలోపెట్టి విప్లవ చైతన్యం కలిగించడము మొదటిది. దేశాన్ని యింకా తీవ్రమైన కార్యక్రమంద్వారా లానున్న పోరాటానికి సన్నిద్ధంచేయడం రెండవది."

ఫార్వర్డు బ్లాకు ఫెడరేషనుకు, యుద్ధానికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటాన్ని కోరుతుంది. కాంగ్రెసు కార్మిక కర్షక సంఘాలతో సన్నిహిత సంబంధం కలిగివుండాలనీ, సంస్థాన ప్రజాఉద్యమానికి నాయకత్వం వహించి నడపాలనీ కోరుతుంది: కాంగ్రెసు కార్యక్రమాన్ని సత్వరంగా ఆచరణలో పెట్టడానికి జాతీయ వాలంటీరు సైన్యాన్ని నిర్మించాలని కోరుతుంది. అంతే ఫార్వర్డు బ్లాకు కార్యక్రమం కమ్యూనిస్టులు, సోషలిస్టులు వెంటనేకోరే కార్యక్రమం వంటిదే.

అపాయం!

అయినప్పటికి యీ బ్లాకులో అనేక విధాల వారు జేరుతున్నారు. యిప్పటి నాయకత్వంతో అసంతృప్తి జెందిన కొందరు మితవాదులు కూడ జేరుతున్నారు: ఒక ప్రత్యేక ఆదర్శ సమన్వితమైన సంఘంగాక పోవుటచే ఫార్వర్డుబ్లాక్ ప్రస్తుత నాయకత్వాన్ని తప్పులెంచుతూ ప్రతి మాటికి ఎదిరించుచూ, కాంగ్రెసులో చీలికలు కల్పించే అవకాశాలుకూడ లేకపోలేదు. అటుల చేస్తే కాంగ్రెసంస్థనే బలహీన పరుస్తుంది.

ఇట్లు తలంచుట కేవలం అనుమానమాత్రం చేతనేకాదు. ఈమధ్య బోసు తన ఉపన్యాసంలో. "చీలిక అవసరం కావచ్చు" అనడం కాంగ్రెసును జాతీయోద్యమాన్ని నెదుర్కొనుచున్న తీవ్రక్లిష్ట పరిస్థితులు. యీసందేహానికి తగిన కారణాలున్నాయని రుజువు చేస్తున్నాయి. ఫార్వర్డుబ్లాకు ప్రధానంగా తీవ్రజాతీయవాదుల ముఠాఅగుటచే అభివృద్ధి కరమైన సంస్థే. కాని మితవాదుల మూర్ఖపు పట్టుదల ఫలితంగా తీవ్రవాదులలో నేడు వున్న తీవ్ర అసంతృప్తి, నిరాశాజనితమగు ఉగ్రత చీలికలు గలిగించి కాంగ్రెసును బలహీనపరచవచ్చుననే సంగతిని నిర్లక్ష్యం చేయుటకూడ గ్రుడ్డితనమే. అవుతుంది.

తీవ్రవాదుల ఐక్యతకావాలి.

మన జాతీయ ఉద్యమం తీవ్రక్లిష్ట పరిస్థితులలోవుంది. ఐక్యత నేడు అత్యంత అవసరం: చీలికలువచ్చే అవకాశాలుకూడా నేడు ఎక్కువగా ఉన్నాయి. తీవ్రవాదులందరూ కలసి తమ శక్తినంతా వినియోగించి మితవాద నాయకులతో పోరాటమే పనిగా పెట్టుకోక—కార్మిక కర్షక పోరాటాలను సాగించి, స్థానిక కాంగ్రెసు సంఘాల సహకారాన్ని సంపాదించుట ద్వారా నాయకుల దిగజారుడు విధానాన్ని ఎదిరించగలరు: కాంగ్రెసు ఐక్యతను కాపాడి జాతీయ పోరాటానికి పునాది ఏర్పరచగలరు. దీనిద్వారానే లక్షలుగావున్న కాంగ్రెసు వారిలో చైతన్యం గలిగించి రాజకీయ పోరాటంయొక్క అవశ్యకతను వారిదృష్టికి తేగలరు.

తీవ్రవాదుల ఐక్యత సాధించుటకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, ఫార్వర్డుబ్లాకు, యితర తీవ్రవాదులందరూ కలసిన కాన్ఫరెన్సు పిలవాలి, అందులో అందరూ సమ్మతించిన కార్యవిధానం నిర్ణయించాలి. ఈ ఐక్యత ఆచరణాత్మకంగా ఉండటానికి రాజకీయ, నిర్మాణ నినాదాలు ముందుగానే నిర్ణయింపబడాలి. మన నెదుర్కొనుచున్న క్లిష్ట సమస్య యెడ దృక్పథం స్పష్టపరచాలి. కాంగ్రెసు ఐక్యతను కాపాడుట, దానిని సంయుక్త నాయకత్వం వహించే సంస్థగా గాచేయుట తీవ్రవాదులందరి ప్రధాన ఉద్దేశ్యంగా ఉండాలి. తీవ్రవాదులలోనే చీలికలు రాకుండటానికి ఒక భాగం మరొకభాగానికి నష్టాన్ని కలిగించి లాభం పొందటానికి ప్రయత్నించరాదు. 'అతివాదుల కలయిక'లోని వివిధ పార్టీలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రత్యేకతను కలిగివుండవచ్చును.

ఈ పనులు వెంటనే జరగాలి. వీనిని జయప్రదంగా అమలు పరచుటలోనే రాజీకొరకు ప్రాకులాటను అరికట్టగలం. కాంగ్రెసులో చీలికలు రాకుండా చేసి ఐక్యతను కాపాడగలం. యుద్ధమూలంగా వచ్చేక్లిష్టపరిస్థితులను ఎదుర్కొని భారత జాతీయపోరాటాన్ని యింకా ముందుకు తీసికొని పోగలము.

## ఇచ్ఛాపురం వేసంగి ఆర్థిక రాజకీయ పాఠశాల

(మే 1 నుండి. మే 28 వరకు)

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్. జిల్లా సోషలిస్టు, రైతుసంఘాల యాజమాన్యమున ఈ స్కూలు జరుపబడింది.

పాఠశాల కార్యక్రమం

ఉదయం
5—30 - 6—30 వాలంటీరు డ్రిల్లు
8—30 - 10—30 పాఠములు
సాయంత్రం
3—0 - 5—0 ..
5—30 - 6—30 వాలంటీరు డ్రిల్లు
రాత్రి
9—0 - 10—30 వివిధ విషయములపై చర్చలు
అధ్యయన తరగతులు

ఇదేగాక వారమున కొకటి రెండుసార్లు విద్యార్థులతో సమీపగ్రామములలో రాజకీయ ప్రచారం గావింపబడెడిది.

ఉపన్యాసకులు—విషయములు

1. కామ్రేడ్. జి. రామకోటీశ్వరరావు (ఆం॥ రా॥ వి॥ ఫె॥ జనరల్ సెక్రటరీ) అర్గనైజరు.
2. „ సి. సూర్యనారాయణ ప్రిన్సిపాలు
   యువజన విద్యార్థి వుద్యమాలు;
   కార్మిక సమస్యలు;
   వివిధ జాతీయోద్యమాలు.
3. „ ఖార్డికర్ (బొంబాయి)
   చారిత్రక భౌతికవాదము;
   కాపిటలిజం; సోషలిజం, కమ్యూనిజం;
   రష్యను విప్లవము.
4. ఆచార్య రంగా
   కార్మిక కర్షక రాజ్యము;
   పన్నుల విధానము;
   ఆర్థికవిధానంలో చేతిపరిశ్రమల స్థానం;
5. కామ్రేడ్. రామలింగయ్య
   హిందూదేశ ప్రభుత్వ విధానము;
   సంస్థానాల సమస్యలు;
   స్వాతంత్ర్యోద్యమ చరిత్ర;
   రాజకీయాలలో వివిధ పక్షముల సిద్ధాంతములు.
6. „ పుల్లెల శ్యామసుందరరావు
   సహకారోద్యమము;
   రైతు సమస్యలు.
7. చనీ ముఖర్జీ :- వాలంటీరు శిక్షణ

స్కూలుకు మొత్తం 35 మంది విద్యార్థులు వచ్చిరి. 10 మంది ఇతర జిల్లాలవారు. వీరందరును విద్యార్థి ఉద్యమములో పనిచేయటానికి పూనుకున్నారు. విశాఖపట్నం జిల్లాలోని విద్యార్థులలో 8 మంది, తాలూకాకొక్కరు చొప్పున రాజకీయప్రచారకులుగా తమ సర్వకాలమును వినియోగించుటకు సిద్ధపడినారు.



# మునగాల జమీందారు రాజీని ఎలా భగ్నంచేశాడు?

## ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ ప్రధాన కార్యదర్శి ప్రకటన

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ప్రధానకార్యదర్శి చలసాని వాసుదేవరావుగారు దిగువ స్టేటుమెంటు ఇస్తున్నారు.

రాజీ షరతులలో ఒకటి (ముఖ్యమైనది కూడాను) జమీందారు 1930 వ సం॥ తదుపరి రైతుల ఆస్థులను అక్రమంగా స్వాధీనం గావించుకున్న భూములను తిరిగి రైతులకు జమీందారు యిచ్చుట.

దీని ప్రకారం జమీందారు స్వంత కమతపు భూములలో కలిసియున్నయట్టి భూముల నన్నిటిని రైతులకు విడగొట్టవలసి యున్నది.

కాని, జమిందారు అటుల చేయలేదు.

రాజీ కుదిరినది మొదలు జమిందారు రాజీని ఏదో విధంగా భంగపర్చుటకు ఎత్తులు వేస్తూనే వచ్చాడు. రైతులు అష్టకష్టములుపడి తాము అమలుచేయవలసిన రాజీ షరతులను జమిందారు క్షణక్షణం భంగపర్చుచున్నను, పూర్తిగ శక్తికొలది అమలు జరుపుచునే వచ్చిరి.

రైతుల తరపున రాజీ షరతులు అమలుపర్చటము అనగా రైతులు శిస్తులు చెల్లించుచుండడమే. కాని, రాజీషరతుల ప్రకారం గాకుండా తమ డిమెండు ప్రకారము శిస్తులు చెల్లించమనడం, చెల్లించినప్పటికిని పూర్వ రసీదు లివ్వకపోవటం, లెక్కలు పెట్టకపోవటము, సర్వేప్లానులు యివ్వకపోవటం, వాటికి లోబడినను రాజీషరతులలో లేని కమతపు శిస్తులనుగూడ వెంటనే చెల్లించితేనేగాని, రాజీ అమలుజరుప ననటం, ఈవిధంగా మొదటనుంచీ రాజీని భగ్నము చేయుటకు జమిందారు పేచీపై పేచీలు పెట్టుచునే యుండెను.

అందుచేత రైతులు శిస్తులు చెల్లించుదామన్నా, అనగా రాజీషరతులు అమలు జరుపుదామన్నా వీలు లేకుండా జమిందారు తుదకు విషమ పరిస్థితికి తీసుకువచ్చెను.

జమిందారు ఈవిధంగా జాగుచేయుచున్నను ప్రభుత్వము ముఖ్యంగా కలెక్టరు, సూపరింటెండెంటుగార్లు కూడ రాజీషరతులు జమిందారు అమలు జరుపునట్లు చేయలేకపోయిరి.

పై రాజీప్రకారం క్రిమినల్ కేసులు ఎత్తివేసుకుంటామన్నది ఎత్తివేయకపోగా వాయిదాలకు రైతులు ప్రతిదఫా హాజరగుట తప్పలేదు. చివరి రోజుల్లో అరెస్టు వారంట్లు, జామీన్ కేసులు తప్పలేదు.

రాజీప్రకారం జమిందారు 1346 ఫసలీకి వెనుకటి శిస్తు బకాయీలను రద్దుచేయవలసి యున్నప్పటికిని ఆ బకాయిలకు ప్రస్తుతం శిస్తుల సమ్మెరీసూట్లను రికార్డులలో ఫైలుచేసి డిక్రీలను పొందుచుండెను. ఇవన్నీ యథేచ్ఛగా జరుగుచునే యున్నవి.

జమిందారు చులకనగా యొనర్పగల రాజీ షరతులను గూడ నెరవేర్చలేదు. ఈనాములకు పట్టాలు యివ్వలేదు. ప్రతిఫలశూన్యం నోట్లను రద్దుచేయలేదు. జరిమానాలను తిరిగి ఇవ్వలేదు. బండలకు నూతులను బాగుచేయించుకొనుటకు తీసుకువెళ్ళనిచ్చుటలేదు. రయితులు శిస్తులు చెల్లించుచున్నప్పటికిని ఈ విధముగా త్వరగా అమలుపర్చగల రాజీషరతులను గూడ జమిందారు అమలుపరచకపోయెను.

ప్రభుత్వ ఉద్యోగులు కూడ జమిందారుచే రాజీ షరతులు అమలుపర్చునట్లు చూడలేదు. అందువలన ఉద్యోగస్థులయందు, జమిందారుయందు రైతులకు నమ్మకం పోయింది.

ఈ సంవత్సరం మెట్టపైరులు పూర్తిగా నాశనమై తొలకరిలో వేసిన వేరుశనగ స్వల్పముగా పండి, పండిన పంట తినుబండారములకే చాలక, రైతులు బాధపడుచుండగా, రాజీని అమలుపరచుటకు ఎంతో కష్టపడికూడ శిస్తులు కట్టిరి.

రైతులు నిరుటి సంవత్సరం శిస్తుక్రింద రు. 20 వేలున్నూ, యీ సంవత్సరంక్రింద దాదాపు రు. 10 వేలున్నూ శిస్తు చెల్లించారు.

రాజీ ప్రకారము తమ కష్టాలన్ని గట్టెక్కకపోయిననూ, కొంతవరకైన తాత్కాలిక ప్రశాంతి రాజీ భగ్నము గాకుండా వుండగలందులకు యెంతో శ్రమకోర్చి శిస్తులు శక్తికొలది చెల్లించారు.



కామ్రేడ్ చలసాని వాసుదేవరావు

ఈ మొత్తం యెట్లు చెల్లించారు? తమకు తొలకరిలో పండిన వేరుశనగ పంటనూ అయిన కాడికి బేరమిచ్చి ముందు పంటలను జట్టీలకిచ్చి, సాహుకార్ల వద్ద కి రూ 0-1-0 నుండి రూపాయి 2 అణాలవరకూ వడ్డీ చొప్పున అప్పుతెచ్చి యీ శిస్తును కట్టగల్గినారు. వాళ్లకున్న వీళ్ళన్ని ఉపయోగించినప్పుడే ఈ మొత్తం తేగల్గినారు.

ఈనాడు రైతుల స్థితిమాచిన ఘోరముగవుంది. శిస్తులను కట్టలేనిస్థితిలో వుండుటటుంచి తినుటకు తిండి అనేక కుటుంబములకులేదు. గొడ్లకు మేతలేదు. నూతులలో నీరు వొట్టిపోయెను. ఈ స్థితిలో నున్న రైతులు రాజీ భగ్నముగాకుండా వుండగలందులకు ఒక మాసము రోజుల క్రితం వరకూ తమ శక్తి వంచనలేకుండా ప్రయత్నించిరి. కాని, జమీందారులకు గాని, ప్రభుత్వోద్యోగస్థులకుగాని, కదలిక పుట్టలేదు. రైతులు తమ ఆస్తులన్నీ యొడ్డి తాకట్టులనుబెట్టి మనస్ఫూర్తిగ రాజీని అమలుజరుపుటకు ప్రయత్నించుచున్ననూ జమీన్‌ధారు దాగుడుమూతలవలన యెంత మార్పుగల్గి రైతులయినప్పటికిని ఈ పరిస్థితులలో రాజీ అమలు జరుగుతుందనే నమ్మకం ఉండుట సహజము. అన్లే మునగాల రైతులు తుట్టతుదకు రాజీ విఫలమైనన్లే అనియు యీ రాజీ కేవలం తమకు అనేక శ్రమలుపెట్టి శిస్తులు వసూలుచేయుటకే యుపయోగపడినదని గ్రహించగల్గారు.

ఇట్టి పరిస్థితులలో రైతులు యేమిటా కర్తవ్యమని నిర్ణయించుకోవటమునకు తమ జమీన్‌రైతు సంవత్సర సమావేశము జర్పి దీర్ఘముగా ఆలోచించి తుదకు జమీన్‌దారు తమ కోర్కెలీడేరేవరకు సత్యాగ్రహమే శరణ్యమని నిశ్చయించుకున్నారు. రైతు పక్షభిమాని కాకపోయిననూ నిష్పాక్షిక దృష్టితోచూచు ప్రతివాడును రైతులకు సత్యాగ్రహము తప్ప వేరే మార్గములేదని తలంచకమానడు.

ఈ రైతుల సత్యాగ్రహమునకు వాస్తవంగా కారణము చెప్పవలసి వచ్చిన కొంతవరకు ప్రభుత్వమే అని చెప్పవలసి యుండును.

రాజీని జమీందారు భగ్నపరచకుండా, రైతులకు రాజీయందు నమ్మకము పోకుండా వెంటనే రాజీచేసిన వారు రాజీని అమలు జరుపుటకుకూడ ప్రభుత్వ ఉద్యోగస్తులు యెప్పటికప్పుడు ప్రయత్నించిన, ఈ స్థితికి మునగాల రైతులు వచ్చియుండరు. గాన, యిప్పటికైననూ రైతుల వాస్తవమైన కష్టములేమిటో ప్రభుత్వము తెలుసుకుని అచ్చటి రైతుల కోర్కెల నీడేర్చుటకు ప్రయత్నించుతారని ఆశించుతాను.

మునగాల రైతుల యెడల తక్కిన సోదర రైతులందరూ తమ సానుభూతిని వెల్లడించుచూ తమ చేతనైనంత సహాయము మునగాల రైతుల కొనర్చెదరని ఆశిస్తున్నాము. మన ధర్మసమ్మతమైన కోర్కెలేవో, మునగాల రైతుల సత్యాగ్రహము ఎంత ధర్మ సమ్మతమైనదో సోదర రైతులకు తెల్పి ఆ యెస్టేటు రైతుల కోర్కెలను ప్రభుత్వము సఫలమొనర్చువరకు ఆందోళన చేయుటయే నిజమైన సహాయముగాని యీ పై ధర్మమును ఆంధ్రదేశములోని రైతులు మరవరని ఆశిస్తూ ఉన్నాను.

# నవశక్తి

## పార్టీ సభ్యులు ముఖ్యంగా గమనించాలి

జూన్ నెల కోటా — చేర్పించినది.

| | సం॥ లేక | ½ సం॥ చందా | సం॥ లేక | ½ సం॥ చందా |
|---|---|---|---|---|
| విశాఖపట్టణం | 4 | 8 | 0 | 0 |
| తూ. గోదావరి | 15 | 30 | 0 | 0 |
| ప. గోదావరి | 20 | 40 | 2 | 2 |
| కృష్ణా జిల్లా | 37 | 74 | 4 | 3 |
| గుంటూరు | 25 | 50 | 1 | 3 |
| నెల్లూరు | 25 | 50 | 0 | 0 |
| ఇతర స్థలాలు | 8 | 16 | 2 | 1 |
| | 134 | 268 | 9 | 9 |

* * *

పార్టీ సభ్యులందరు తీవ్రంగా కృషిచేసి తమ జిల్లా కోటాలను పూర్తిచేయాలి, నవశక్తి విడిప్రతుల అమ్మకం ఎక్కువ చేయాలి, విరాళాలు పోగుచేయాలి. జిల్లాలు, తాలూకాలు యీ పని నెరవేర్చడంలో సోషలిష్టు కాంపిటీషన్‌తో పనిచేయాలి. నవశక్తి నిలవడం యింకా వృద్ధి అవడం మీ చేతుల్లోనే వుందనే సంగతి మరువకూడదు. — సంపాదక వర్గం.




జూన్ 11వ తేదీ విడుదల

ఎస్. ఎస్. ఆర్. ఫిలిమ్సు వారి

# జయప్రద

(తెలుగు టాకీ)





బెజవాడలో

విడుదలకు

నిరీక్షించుడు!

తారాగణం:

సి. యస్. ఆర్., యశోద

లలిత, పచ్చయ్య,

నరసింహారావు........








డైరక్టరు: చిత్రపు నరసింహారావు

అసిస్టెంటు: చిత్రపు చలపతిరావు, బి. ఏ.



For Booking: **S. S. R. FILMS Ltd., Cuddapah**

**No. 6 Harinston Road, Chetput, Madras.**



# పోలీసు అత్యాచారాలచే కాంగ్రెసు ప్రతిష్ఠకు కళం తెచ్చిపెట్టకుండా కాంగ్రెసు మంత్రివర్గం జాగ్రత్త పడాలి.

## రైతు సత్యాగ్రహులెంతటి త్యాగం చేయడానికైనా సంసిద్ధులై యున్నారు.

అచార్య రంగాగారి ప్రకటన.

మునగాల జమీందారీలో రైతు సత్యాగ్రహ సందర్భములో జరిగిన పోలీసు లాఠీచార్జీలపైన ఆచార్య ఎన్. జి. రంగా, య. యల్. ఏ. (సెంట్రల్)గారు యీనెల 8 వ తేదీని యీక్రింది ప్రకటన కావించి యున్నారు.

"మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వ క్రిందనున్న పోలీసుశాఖవారికిన్నీ మేజిస్ట్రేట్లకున్నూ లాఠీచార్జీలంటే మంచినీళ్లి ప్రాయంగా ఉన్నట్లున్నది. ఇట్టి వైఖరి నిజంగా శోచనీయమైనది అనే చెప్పాలి.

అఖిల భారత రైతుసంఘ ఉపాధ్యక్షులు ఆచార్య రంగా

బకాష్టు భూముల విషయమున యిటీవల బీహారు రాష్ట్రంలో జరిగిన కిసాన్ పోరాటపు సందర్భంలో ఇట్టి లాఠీచార్జీలు ఉండి యుండ లేదు; రాష్ట్రీయ కాంగ్రెసు ప్రభుత్వముల వైఖరిలో ఇంత భేదము ఉండటానికి కారణమేమిటో అవగాహనం కావడంలేదు; మన రాష్ట్రీయ కాంగ్రెసు ప్రభుత్వమునకు రాజేన్ బాబువంటి వ్యక్తి నాయకుడై యుండని కారణమునన్నా, లేక మన రాష్ట్ర కాంగ్రెస్ మంత్రివర్గంవారు అతి మితవాదులు అయి ఉండడం చేతనా? వివిధ కాంగ్రెస్ ప్రభుత్వాల వైఖరిలోను విధానాలలోను ఇంతటి తారతమ్యాలు ఉండటానికి కారణం ఏమైయుంటుంది?

కాళీపట్నం రైతు సత్యాగ్రహంలో, పోలీసువాళ్లు రైతు సత్యాగ్రహులపైన ఇష్టం వచ్చినట్లు చెడమడా లాఠీలను ప్రయోగించి ఇంకా ఎంతో కాలం కాలేదు. నిరంకుశుడైన స్థానిక జమీందారు అక్రమంగా, రైతుల స్వంతభూములను దురాక్రమణ చేయగా రైతులు వారి భూములను వారు దున్నుకుంటూ ఉంటే, శౌర్యవంతులైన మునగాల రైతులను పోలీసులు అమానుషంగా లాఠీలతో మోదినారను ఘోరవార్త ఇవ్వాళ నాకు తెలిసింది. శాంతియుతంగా సత్యాగ్రహులను అరెస్టు చేస్తే చాలదా? అక్రమంగాను అన్యాయంగాను, అమానుషంగాను దురాక్రమణ చేయబడిన ఈమునగాల రైతుల ఇండ్లను భూములను తదితర ఆస్తులనూ ప్రభుత్వంవారు తిరుగ స్వంతదారులైన రైతులకు ఒప్పగించే ప్రయత్నాలు ఇంతవరకు చేసియుండకపోవడం అతి శోచనీయాంశము; అది మన్నింపరాని వైఖరికూడాను.

న్యాయనిర్ణయార్థం, మునగాల రైతులు శాంతియుత సత్యాగ్రహోద్యమమును విరామం లేకుండా సాగించడానికి కృత నిశ్చయులై యున్నారనీ, యింతవరకు 150 మంది రైతులు అరెస్టు అయినారని తెలిసింది. పూర్వ ప్రభుత్వపు అనుచితమైన సాంప్రదాయములను అనుసరించి, ప్రస్తుతపు కాంగ్రెస్ ప్రభుత్వంవారు కూడా పశుబల ప్రయోగం మూలమున సత్యాగ్రహుల నైతిక శౌర్యమును హరింపవచ్చునని లాఠీదెబ్బల ప్రయోగానికి దిగడంకన్నా మించిన నైతికపతనం వేరుండదని నా అభిప్రాయం; మద్రాసు ప్రభుత్వంవారు ఆ విధాన మాచరింపరని నేను విశ్వసిస్తున్నాను. ఈ రైతు సత్యాగ్రహులు ఎంతటి త్యాగం చేయడానికైనా సంసిద్ధులై యున్నారని ప్రభుత్వం వారిని హెచ్చరించడం నా కర్తవ్యం.

మునగాల జమీందారీలో జరిగిన పోలీసు అత్యాచారములూ, అమానుష కృత్యములూ యధేచ్ఛగా సాగనిచ్చి, జాతీయ కాంగ్రెసు పేరు ప్రతిష్ఠలకు కళంకమును తెచ్చిపెట్టకుండా ఇక ముందైనా మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గం వారు జాగ్రత్తపడగలరని హృదయపూర్వకముగా నే నాశిస్తున్నాను.

ఆలస్యం చెయ్యకుండా, రాష్ట్రీయ కాంగ్రెసు అధికారవర్గం వారు కలుగజేసుకొని అన్యాయముగాను, అక్రమంగాను స్థానిక జమీందారు దురాక్రమణచేసిన భూములనూ, ఇండ్లనూ, తదితర ఆస్తులనూ రైతు సత్యాగ్రహులకు విడుదల చేయవలెనని వారిని నేను కోరుచున్నాను."

# కాంగ్రెసు ప్రభుత్వములోనే లాఠీచార్జీలు జరిగితే రైతు-కూలీలకు రక్షణ యెక్కడ?

## శాసనధిక్కారం అయితే, అరెస్టుచేసి కేసులు పెట్టవలెగాని, లాఠీచార్జీ ఎందుకు?

మునగాలలో జరిగ్గిన దుండగాలపై శ్రీ పేటబాపయ్యగారి ప్రకటన

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ కార్యనిర్వాహక సభ్యులైన శ్రీ పేట బాపయ్యగారు ఇట్లు వ్రాస్తున్నారు:

చివరకు మునగాల రైతులు పోలీసుల లాఠీచార్జీలమధ్య అపాయస్థితికి లోనుగావలసి వచ్చినది.

అతి దీనమగు అచటి రైతుల చరిత్ర యంతయు జిల్లా అధికారులకు పరిచయ మయి యుండుటయేగాక, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘము ఒక కమిటీని నియమించి, తద్వారా పరగణా అంతయు సంచారము చేయించి, రైతులు అనుభవించు బాధలన్నియు విచారణ జేయించి, తత్ఫలితముగా ఒక నివేదికను గూడ ప్రకటించియున్నది.

గత డిసెంబరు నెలలో పరగణాలోని కలకోవ గ్రామములోని కూలీలు జమీందారు తమకు న్యాయముగ యివ్వవలసిన కూలీ రాబట్టుకొనుటకై సత్యాగ్రహము చేయటము; దానిపై జిల్లా అధికారులేగాక మద్రాసు ప్రభుత్వము పార్లమెంటరీ ప్రధాన కార్యదర్శిగారగు అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారుకూడ అచటికి వెళ్ళడము, కూలీలకు రావలసిన న్యాయమగుకూలీ జమీందారుచేత యిప్పించడము, దానిపై బయలుదేరిన రాజీ వ్యవహారములు పత్రికల కెక్కిన విషయములే.

ఇప్పుడు ఆరాజీ భగ్నంగావటము, రైతులు సత్యాగ్రహము ప్రారంభించడము, రైతులపై పోలీసుల లాఠీచార్జీలు, నిర్బంధములు జరిగినవి.

న్యాయముగ భూములు రైతులవి అవునా కాదా అనే విచారణ అట్లుంచి, రైతులు శాసన ధిక్కార మొనర్చుచున్నారని పోలీసులు లాఠీచార్జీలు ప్రారంభించినారు.

శాసన ధిక్కారమయినచో అందు పాల్గొన్నవారిని అరెస్టుచేసి కేసులు పెట్టవలయునుగాని, లాఠీచార్జీ యెందుకు?

అరెస్టులకు అలవిగానప్పుడుగదా లాఠీచార్జి చేయవలసినది.

కాంగ్రెసువారి గత రెండు సత్యాగ్రహ సమరముల అనుభవములనుబట్టి ఏమాత్రము అవసరము లేకుండానే, ఎట్టి శాంతి భంగము కలుగకుండగనే, సత్యాగ్రహులను పోలీసులు దారుణముగ లాఠీలచేత హింసించిన విషయములు ప్రపంచమంతటికి సువిదితములే. ఈ లాఠీచార్జి విధానము ఆనాటి ప్రభుత్వము హర్షించినదన్న ఆశ్చర్యములేదు గాని ఆనాడు అట్టి లాఠీచార్జీలకు గురియైన కాంగ్రెసువారే యీనాడు ప్రభుత్వము జేయుచు హర్షించుచున్నా రంటే యెంతటి విపరీతము?

ఆనాడు సత్యాగ్రహ సమరంలో పాల్గొనిన రైతు కూలీలపై అన్యాయముగ ప్రయోగించిన లాఠీచార్జీలు విఫలములైనవని ఆ ప్రభుత్వమే తలంచియుండగా నేటి కాంగ్రెసు ప్రభుత్వము తమను అప్యాయముతో యెన్నుకొనిన రైతులు తమ హక్కులకై జేయు సత్యాగ్రహము ఆపుటకు ఆ పాతమార్గ మవలంబించుట ఎవరికి ఆశ్చర్యము గొలుపదు?

కాశీపట్టణము లాఠీ చార్జీలు, చిట్టివలస కాల్పులు వగయిరా మిక్కిలి అన్యాయములని దేశమంతయు ఆందోళన పడుచుంటే, మునగాల వ్యవహారములలో ఆదే విధాన మవలంబింపబడుచున్నది.

ఈమధ్య బీహార్ రాష్ట్రప్రభుత్వము వారు జమీందారీ రైతులు బకాస్తుభూముల విషయములోజేసిన సత్యాగ్రహమును ఎట్టి లాఠీచార్జీలు కాల్పులు లేకయే పరిష్కరించి యుండగా, మన మద్రాసు ప్రభుత్వమువారికి అట్టి శాంతిమార్గములు యేల కనుపించుటలేదు?

ఈరోజునకు కాంగ్రెసు ప్రభుత్వమువచ్చినది గాన తమకష్టములు చెప్పుకొనుటకు అవకాశము కల్గినదని భావించి, తమ ఆస్తులు తాము రక్షించుకొనుటకు తరుణమేతెంచినదని ధైర్యము తెచ్చుకొని, రైతులు అక్రమవిధానము నెదుర్కొనుటకు ప్రారంభించితే, ఆ రైతులపైన కాంగ్రెసు ప్రభుత్వములోనే లాఠీచార్జి చేయించుచున్నచో యిక రైతు, కూలీలకు రక్షణ యేమున్నది?

ఇకనైన చిరకాలానుగతమగునైన బాధల నుండి విముక్తులగుటకు రైతులుజేయు దౌర్జన్య రహిత సత్యాగ్రహులను కేవలము పోలీసుల నిర్దాక్షిణ్యములగు లాఠీచార్జీలచే అణచ ప్రయత్నింపక సక్రమమగు విచారణ జరిపించి, మునగాల వ్యవహారముల పరిష్కరించుట కాంగ్రెసుమంత్రి వర్గమువారి ప్రధాన కర్తవ్యము.

ఈవిషయములో రాష్ట్రములోని జమీందారీ రైతులు అందరు మునగాల రైతులు దౌర్జన్య రహితముగా శాసన ధిక్కారము చేస్తుంటే జయిలులో పెట్టవలయునుగాని, లాఠీచార్జి వగయిరా క్రూరనిర్బంధ విధానములచేత అణచజూచుట మిక్కిలి అన్యాయమని ఆందోళన జేయవలయును.





# గ్రంథావలోకనం

## పాపం!

రచయిత: విద్వాన్ విశ్వం
32 పేజీలు: వెల తెలియదు
పుస్తకాలకు: సర్వసాహిత్యమాల, అనంతపురం.

★

ఇందలి కథావస్తువు

"చదువుకొన్నాడు శాస్త్రాలు; చాలినంత
జ్ఞానమున్నది; వ్రేలిడరాని నడత;
పాతికేండ్లయిన నిండని లేతవయసు;
కాని, దినబత్తెమున కైన గడన...."

లేని నిరుద్యోగ యువకునిది. ఈ యువకుడు 'కాలి జోడైన లేక', 'వేడిగాడ్పులు రొద రొదలాడుచుండే' సమయంలో 'ఇసుక మైదానమున బడి యేగు'చున్నాడు. ఎందుకో తెలుసునా? అతనికి ఎంత విజ్ఞానమున్నా జీవితం దుర్భరమైపోయింది.

"మాచినాడెంతమందినో కాచియుండి;
వ్రాసినాడెన్నో ప్రార్థనా పత్రములను
తిరిగినాడెన్ని యూరులో తేప తేప
గాని తిండికి మార్గమ్ము గానపడదు."

లోకంలో నిరుద్యోగానికీ, ఆకలికీ, అశాంతికీ కారణం తెలిసికోవాలని ఎంతో సాహిత్యం చదువుతాడు. చివరకు

"వెదకి వేసారి కడపట చదివినాడు
సామ్యవాద సాహిత్యమ్ము."

మా ర్క్స్ తత్వం అతనికి నూతనతత్వాన్ని గోచరింపజేసింది. వర్గరహిత సమాజం ఉన్నపుడే ఈ బాధలంతరించుతాయని తెలుసుకొని ప్రచారానికి ప్రక్క పల్లెకు బయలుదేరినాడు. కాని 'ఇసుక మైదానం'లో

"అగ్నిపర్వతాల్ బ్రద్దలైనట్లు లతని
చెవులు గడియలు పడినవి; దాహ వహ్ని
ఫెళ ఫెళ ధ్వానములతోడ ప్రేలుచుండె
దేహమంతట మంటలు తీవ్రమయ్యె"

★

గుబ యొక్కటి టపటప గొట్టుకొనుచు
ప్రక్కగా దూసుకొని పోయె,
పాపము!
అతడు! పాదములు వశముదప్ప లోద్పాటులేక
కూలిపోయినాడు ఇసుక యెడారిలోన"

పద్యాలు సాఫీగా నడుస్తూ ఉన్నాయి. నేటి సంఘంలోని బాధలు చక్కగా వివరించారు. 'ప్రేయసీ విరహనలా'న్ని గూర్చియే గాక 'నిరుద్యోగ క్షుదనలా'న్ని గూర్చి కవిత వ్రాసేవారు లేకపోలేదని ఈకవి తెల్పాడు.

★

## మాతృస్తవము

ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము, బందరు.
20 పేజీలు: అణా.

★

బంకిమచంద్, రవీంద్ర కవుల "వందేమాతరం జనగణమన" గీతాలుగాక, "ఝండా ఊంచారహే హమారా, జయజయ ప్యారా," అనే హిందీ గీతాలు ఉన్నాయి. తెలుగులో శివశంకరం, వేదుల, గురజాడ, కృష్ణశాస్త్రి, శ్రీ. శ్రీ. రాయప్రోలు మొదలగువారి గీతాలున్నాయి.

ప్రజా సామాన్యానికి అర్థమయినా కాకపోయినా జాతీయోద్యమంతో జీర్ణించుకుపోయి విడిపోవని గీతాలు 'వందేమాతరం, ఝండా ఊంచారహేహమారా' అనే గీతాలు. దాని తర్వాత ప్రసిద్ధిలో ఉన్నది రవీంద్రుని 'జనగణమన' గీతం. ఈ గీతాలు మన కెంత ప్రియమైనా, సంస్కృత పదభూయిష్ఠమై, మన దేశపు ఒకప్పటి ఔన్నత్యాన్నో, లేక నేటి మనదేశ ప్రకృతి సౌందర్యాన్నో మాత్రం స్తుతించి వదలివేయడంవల్ల ప్రజా సామాన్యానికి ఇవి అర్థంకావు. వారి సమస్యలను తిన్నగా ప్రతిబింబింపజేస్తున్నవని వారర్థం చేసుకోలేరు. కాని ఈ గీతాలుపాడుతూ నిర్బంధాలకు గురియైనారు, గనుక ఇవి తమకోసమే అని మాత్రం తెలుసుకొన్నారు.

ఇదే పక్కీలో ఉన్నవి తెలుగులోని శివశంకరం గారి 'మాతరం వందే.' కవికొండలవారి 'స్వాగతమన వోయ్', కృష్ణశాస్త్రిగారి 'జయజయ ప్రియ భారత జనయిత్రి' అనే గీతాలు.

వేములవారి "కాగడా", కృష్ణశాస్త్రిగారి 'భిక్షాందేహి' రాయప్రోలువారి 'తమ్ముడా, జన్మభూమి' శ్రీ శ్రీ 'మరో ప్రపంచం'. అనే గీతాలు నవ్యకవులను జాతీయోద్యమం ఎలా 'ఇన్ఫ్లుయన్సు' చేసిందో తెలియజేసింది. వీరందరి కంటె పూర్వపువాడైనా గురజాడ అప్పరాయకవి వ్రాసిన 'దేశభక్తి' ప్రజా సామాన్యానికి సులభంగా అర్థమవటమే గాక పాడుకొనేందుకు అనువుగా ఉంది.

రచయితలు ప్రసిద్ధులయినా, రచనలలో బూర్జువా వర్గము సృష్టించే కసపడని 'మాత, భూదేవులను' గురించి స్తోత్రాలు రమ్యంగా ఉన్నా ప్రజల కర్థమయ్యే భాషలోనూ, పాడుకొనేందుకు వీలుగానూ ఉండి ప్రజా సామన్య సమస్యలనే తిన్నగా ప్రతిబింబించనంతకాలం ప్రచారానికిరావు. ఇదే భేదం రైతు భజనావళి, కార్మిక భజనావళి ఉన్నంత వ్యాప్తిలో 'మాతృస్తవం' రాలేకపోవడానికి. అయితే 'బూర్జువా' కవులకు ఇది మొదటి రకపు కవిత్వంగాను, రైతు భజనావళి మొదలయినవి 'మూడోరకం' కవిత్వంగానూ కన్పిస్తాయి. కాని ఈనాడు ఆ 'మూడోరకం' కవిత్వమే గావాలి ప్రజలకు.

★

## 1938 సం॥ కార్యకలాపము

ప్రకాశకులు:
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము, బందరు.

★

1938 లో రాష్ట్ర కాంగ్రెసుము చేసిన కార్య కలాపము అంతా సూక్ష్మంగా ఈయబడింది. అంతా బాగానే ఉంది కాని తెనాలిలో నెలకొల్పబడిన కార్మిక కర్షక కార్యాలయం చేసిన పనిని గురించి కొన్ని అనుమానాలున్నాయి.

ఈ శీర్షికక్రింద నిచ్చిన రిపోర్టులో మొదటి భాగం కార్యాలయ ఉద్దేశ్యమూ, చింతమనేని భావయ్యగారిని నియమించడమూ, 670 రూపాయలు ఖర్చుపెట్టడమూ తెలియజేశారు. రెండవ భాగము హరిపుర తీర్మానము గురించి, మూడవ భాగములో "గాంధీ సేవా సంఘము వారు భూమిశిస్తు విధానమందు మార్పులు సూచించుటను, భూములపైన చెల్లించు శిస్తు వస్తురూపకముగా ఉండవలెనా, ధబ్బురూపకముగా ఉండవలెనా యను హంశము నిర్ధారణం చేయుటకు నియమించిన ఉప సంఘ ప్రశ్నలకు గ్రామ గ్రామములకు తిరిగి సమాధానముల సేకరించి పంపారు." అని ఉంది. ఈ కార్యాలయంచేసిన ఘనకార్యమల్లా ఇదేనా? ఇందుకు 670 రూపాయలు ఖర్చవడమువల్ల లాభమేమయిన జరిగిందా? అన్న ప్రశ్న వస్తుంది. రైతు సమస్యలలో ఇంకా శ్రద్ధవహించాలని చెప్పడానికే ఈ భాగాన్ని విమర్శింపవలసి వచ్చింది.

★

## ఫెడరేషన్ నిజస్వరూపం

రచయితలు: దిగవల్లి వెంకట శివరావు బి. ఏ. బి. యల్., భోగరాజు పట్టాభి సీతారామయ్య
72 పేజీలు: అణా.
పుస్తకాలకు:- ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘం, బందరు.

★

మొదటి ఎనిమిది ప్రకరణాలలో ఫెడరేషన్‌ను గురించి, ఫెడరేషన్‌లో గవర్నర్ జనరల్ ప్రత్యేకాధికారాలు, బ్రిటిష్‌పార్లమెంటు సర్వాధికారమూ, బ్రిటిష్‌వారి శాశ్వత హక్కులూ, ఫెడరల్ శాసనసభ నిర్మాణమూ మొదలైనవి చర్చించారు. తుదిప్రకరణం చాలా ముఖ్యమైనది నూతన శాసనం ఎలా మన అధికారాలను లాగివేస్తున్నదో తెలియజేస్తుంది.

చివర పట్టాభిగారి ముగింపు వాక్యాలు కూడా ఉపన్యాస ధోరణిలో ఫెడరేషన్ అంటే ఏమిటో సూక్ష్మంగా విచారించాయి. ఒకచోట ఆయన ఇలా వ్రాశారు.

"ఫెడరేషన్ను గూర్చి ఓపికగా వ్రాయడం కష్టం. యావత్తు జాతికీ ఇది అవమానం. అసలు రొట్టి లేని దానికన్న చిన్నముక్క ఐనా మంచిదేకదా అని కొందరి వాదన. కాని రొట్టెకాకపోతేమానె రొట్టెలో తునకగూడా కాక కంకర రాయి మన చేతుల్లో పెట్టినప్పుడు మన కర్తవ్యం ఏమిటి? గులకరాయిని ఎంత నమిలి కొరికినా కొరుకుడు పడదు, తియ్య పడదు. నిస్సంకోచముగా ముందు వెనుకలు ఆలోచించకుండా ఈ కంకరరాయిని బంగాళాఖాతంలో విసిరిపారెయ్యాలనే సంగతి వేరుగా చెప్పనక్కరలేదు."

ఇలాంటి అత్యవసరవిషయాల్ని విశదీకరించే ప్రచురణను చౌకగా ఇస్తున్నందుకు రాష్ట్రకాంగ్రెసును అభినందించాలి. ఇలాగే, యుద్ధంలో ఎందుకు పాల్గొనరాదో, జాతీయ వాంఛా తీర్మానంలో ఉదహరించినట్లు మనము స్వరాజ్యాన్ని స్థాపించుకొనేందుకు ఎలా అర్హులుగా ఉన్నామో, తెలియజేసే ప్రచురణలు ప్రకటించాలని కోరుతున్నాం.

★

## స్వీకారం

'కరుణకుమార' కథలు (మొదటి సంపుటం)
వెల 12 అణాలు.

★

ఆధునిక వాఙ్మయ కుటీరము,
నెం 1. స్పర్‌టాంక్, 2-వ వీధి,
ఎగ్మోర్, మద్రాసు.

★ ఏకాంకనాటిక

# సంజ దివ్వె

హరీంద్రనాధ చటోపాధ్యాయ ప్రణీతం

అనువాదం : జనమంచి "మఘపాణి"

యువకుని చదువుకొనే గది. అతను ఛాయా ప్రియుడు. ఒక్కడూ ఏకాంతముగ ఉన్నాడా గదిలో. వెలిగించినదీపముతో దాని ప్రవేశిస్తుంది.

దాని : గుడ్ ఈవినింగ్ బాబూ!

యువకుడు : గుడ్ ఈవినింగ్! నిన్ను దీపముతో చూడటానికి ఎంతేనా సంతోషంగా ఉంది. ఎందుచేతనంటే, అది నీ నీడను పడేట్లా చేస్తుంది!

దాని : నీవనేది, ఆ దీపం నీగదిని కాంతివంతముగానూ, వస్తువులను కనుపించేలాగ నీలు కల్ల చేస్తూందనా?

యువ : భూమిమీద ఉన్న ఏ వెలుగూకూడా ఏ వస్తువునూ చూపలేదు. దానిని వెలుగని పిలువవు కదూ, పిలుస్తావా? కాని ఏవిధంగానైనా ఆ జ్యోతికి కృతజ్ఞత. ఎందుచేతనంటే నీడల పుట్టుటకు సహాయకారి.

దాని : ఎంత వింతగ మాట్లాడుతావు బాబూ!

యువ : ఇట్లా రా! నీ వ్రేళ్లతోటి ఛాయా మృగాలనూ, ఏకైక ఛాయా పర్వతాగ్రాలనూ చేయటం. నీకు నేర్పటానికి. చేతులను పట్టుకోనీ.... (ఛాయా నిర్మాణ కళయందు 'తరిబీదు' ఇచ్చుట కన్నట్లు ఆమె చేతులను దీపంవైపు ఎత్తి కొంటాడు.)

దాని : నాకు భయమేస్తూంది ఓ నాకు భయంగా ఉంది. బాబూ! చిన్న బాబూ! నేను వణికి పోతున్నా....

యువ : నిజంగా, నిర్మలంగా ప్రేమిస్తూన్నప్పుడు, ఎప్పుడూ ఎవళ్లయినా వణుకుతారు. చూడు, మన నీడలు ఎట్లా కలుసుకుని ఒకదానిలో ఒకటి ఐక్యమైపోతున్నాయో. పురోహితుడు లేకుండగ, ఏ పిచ్చి మంత్రాలూ, తంత్రాలూ లేకుండగ అవి పెండ్లి చేసికొన్నాయి. నీడలు, ఏ బూటకపు బాంధవ్యాలూ ఎరుగవు. మా అమ్మ నీడ నా నీడతో కలిసికొన్నప్పుడు అవి కూడా పెండ్లిచేసికొంటాయి సుమా! నీడలు బూటకపు విలువ లేక స్వచ్ఛమై స్వేచ్ఛ గలవి.

దాని : చిట్టిబాబూ! నన్ను ధ్వంసము చేయబోతున్నావు.

యువ : నిన్ని ప్రాపంచిక ధ్వంసంనుండి తీసికొని పోతున్నా. నిన్ను మరత్వంతో జీవింప చేయాలని ఉంది, ఛాయలను ప్రేమిస్తూ.

దాని : నీ వెప్పుడూ విచారంగా కనుపిస్తావు.

యువ : నే నెందుచేత విచారంగా ఉన్నానంటే ఈ ఇంట్లో ఎవ్వరూ ఈ నీడలను అర్థం చేసుకొని ప్రేమించరు. ఓ! ఛాయకేసి చూడు. దాన్ని నే నెంతో ప్రేమిస్తాను! ఎంతేనా ప్రేమిస్తాను! (లాలన చేద్దామన్నట్లు నీడవైపు వడిగున వెడతాడు.)

దాని : బాబూ! ఏమిటి చేస్తున్నావు ఓ! ఓ! ఓ!

యువ : దారికడ్డుగలే - (మోటుగా ఆమె నవతలికి తోసేస్తూ) ఓ చిన్నదానా, ఇక్కడ నీవు లేకుండగ నీ నీడను పడునట్లుచేయలేవూ? దారి కట్టుగ లేకుండగ రక్త మాంసాదులతో అసహ్యంగ లేకుండగ నీడలను పారనియ్య లేవూ? నిన్ను నెమ్మదైన స్వర రహితమైన నీడలా చేయగలనేమోనని అనుకుంటున్నా....

దాని : (పైకి ఏడుస్తుంది) అతనికి పిచ్చెత్తింది. నిశ్చయం. అతను పిచ్చివాడైపోతున్నాడు. (....యువకుని తల్లి ప్రవేశం).

తల్లి : ఏమి టీగొడవ ?

దాని : అతన్ని దయ్యాలు పీక్కు తింటున్నాయి. అమ్మా! ఈ ఇల్లు దయ్యాల కొంపయిపోయింది. నన్నుకూడా దయ్యాలు పీడిస్తున్నాయి మరి నేను ఇల్లు విడిచి పోదామనుకుంటున్నా....

("బాపురు" మని ఏడుస్తూ ఆమె బయటికి పారిపోవును.)

యువ : గుడ్ ఈవినింగ్ అమ్మా.

తల్లి : గుడ్ ఈవినింగ్ బాబూ! నీ పరీక్షలకు ఇంక పన్నెండు దినాలున్నాయని తెలుసుకో. ఈ మధ్య కొన్ని నెలలబట్టి నీవు చేస్తూన్నది నీడలను కనిపడుతూండటం వటితో మాట్లాడు తూండటమూను....

యువ : అమ్మా విను....నాన్న ఎక్కడున్నారు?

తల్లి : గోరీలో ఉన్నారు బాబూ!

యువ : ఆయన ఇప్పుడొక నీడ. అందుచేతనే ఆయనంటే ఎంతో ప్రేమనాకు.

తల్లి : జులైనాటి వర్షముపడిన చీకటి రాత్రి నుండీ, బాబా! నీవు వింతగ ప్రవర్తిస్తున్నావు.

యువ : అమ్మా, నీకంటె నీనీడను ఎక్కువగ ప్రేమిస్తానని నీకు తెలుసునా? నిజానికి మూర్ఖులు, పదార్థమని పిలిచేదానికంటె నేను నీడనే ఎక్కువగ ప్రేమిస్తాను. ఎక్కువ కాంతితో తగులబడిపోయేచెట్లు, రంగు రంగుల మయూరము—వాటి నీడలంత అందంగానూ ప్రాణమున్నట్టుగానూ యదార్థంగానూ ఉండవు. ఓ! పర్వతంమీద పడే మొయిలుఛాయ కొండమీది పక్షినీడ, పొలముమీది రైలునీడ, మరి నీటిమీది ఓడనీడ! అవన్నీ నాకొనగు ఆనందానికి వాటి ముందర మోకరిల్లుతాను. వాటిని పూజిస్తాను. వాటినుండి నాభావనను రేకెత్తింపజేసికొంటాను. ఎందుచేతనంటే, నీడఎంతో ఎంతో మహత్తరమైనది, నెమ్మదైనది. చెరచలేనిది. పామునీడ విషహీనమైనది. పెద్దపులినీడ ప్రపంచాన్ని మ్రింగేటంత ఆకలిలేనిది. ఎందుకూ్లపురోహితుని నీడ కల్మషరహితమైనది. మరి దేవాలయపునీడ దేవాలయములోపల జరిగే దురాచారాలతో ప్రమేయంలేనిది. ప్రభుత్వోద్యోగి నీడ హృదయాంతర్గత కుష్ఠురోగము బారినుండి లొంగింపబడినది బూటకపు భక్తుని నీడను అతనిలోని కుటిలము వీడుతుంది. ఓఅమ్మా! ఎంత మహత్తరమైనది నీడ!

తల్లి : నీవు నీడలను వెంటాడుచున్నావురా బాబా.

యువ : కాంతి కవాటమువద్దకు నన్ను తీసికొనపోవువరకు నేను నీడలను వెంటాడుతాను. అంతిమ జ్వలితమైన ఛాయ. ఇంచుక జ్వాలకైనా స్థానములేని కాంతి. ఓ అమ్మా, చూడు....చూడు.

తల్లి : కొన్ని నెలల నుండి జంతుశాస్త్రము ముట్టుకోవడముకూడా మానివేశావు.

యువ : చూడమ్మా నా ప్రేమ్కయుందున్న శాస్త్రము జంతుశాస్త్రపు నీడ. చూడు—ఇప్పుడు, అమ్మా ఇదిగో వాకల గుర్రం. మరి కావలిస్తే కోతి. ఇదిగో, ఇదిగో పె....ద్ద నీటి గుర్రం. చూడు—జాగ్రత్తగా చూడు....గుర్రం ఏరాజకుమార్తయిన సరే సవారీ చేయటానికి తగదు........ఎంత చలాకీగా చురుగ్గా, మత్తుగా ఉన్నాయో....

తల్లి : ఆల్జీబ్రా (Alzebra) మీద, జ్యామెట్రీ (Geometry) మీద నీ మనస్సు నిల్చేట్లాచేయటానికి అతనికి సాధ్యముకాకుండగ ఉందని, నీమాష్టరు మొత్తుకుంటూ ఫిర్యాదు చేస్తున్నాడు. నీకు తెలుసునుగా, నీవెంత వెనక పడిపోతున్నావో లెక్కల్లో.

యువ : అమ్మా నాకు లెఖ్ఖలంటే రోత. జీవితంలో లెక్కపెట్టుకోవలసినంత విశేషాలేమీలేవు. నామట్టుకు అది, నీడకొక తెంపులేని సుసమయం. నిజానికి. అమ్మా ఛాయా దేశంలో లెఖ్ఖలుండవు ఏవివరము వుండదు. ఎందుచేతనంటే ప్రతిఛ్ఛాయ మరొక ఛాయకుగల ప్రకృతిగలదే. అవన్నీ ఐక్యత చెందినవాడు. అవి ఒక ఉత్కృష్టమైన పెద్దనీడ అవుతాయి. యాతనా భరితమై, చితికిపోయి, బాధాజనకమై ఎందుకూ పనికిరాని కలలుకంటూ ఉండే ప్రపంచకములో వివరణాలు ఉంటాయి.

తల్లి : నీవు ఊరికే రోజుకుంటున్నావు........

యువ : నిన్నుకూడా నీడలను ప్రేమించేలా చేస్తాను—ఏదో ఒకరోజున, ఒకవేళ రేపే ఏమొ, ఒకవేళ ఈదినమే — ఒకవేళ — ఇప్పుడే! అప్పుడే నీలో నీడను ప్రేమించే బీజము అంకురించింది. నా గతించిన తండ్రి గోరీమీద ఉంచుటకు పూవులను తీసికొని వెళ్ళినప్పుడు, నీవు నిజంగా ఏమరుపాటుతో నీడకే అంజలి ఒసగుచున్నావు........కాని అది తెలిసియుండి చేయటం నేర్చుకోవాలి. రా అమ్మా—నాదగ్గర కూర్చో. తిన్నగా నాకళ్ళల్లోకి చూడు.

తల్లి : ఓ! ఎంత భయమేస్తూంది, నీవు పట్టుకుంటే—ఓ పరమేశ్వరా!

యువ : మనిషినీడకు ఇచ్చిన ప్రథమ నామమే దేముడు. ఇప్పుడు రా.....తీక్షణంగానా కళ్లల్లోకి....చూడు!

తల్లి : నన్నేమి చేద్దామని ఉందిరానీకు! మంత్రిద్దామనా?

యువ : ఒక్కసారమ్మా....చూడు!

తల్లి : నేనుమాత్రం చూడలేను. ఎందుచేతనంటే. నీకళ్ళు ప్రీక్కుతీయటున్న నీడలలాగున్నాయి.

యువ : అవి ప్రపంచకపు ఏకాంతమైన ఛాయల కాకరమైనవి.

తల్లి : చూడు, చూడు....

యువ : ఎక్కడ అమ్మా

తల్లి : నీవైపే. నీకు పులకరం తగిలింది.

యువ : ప్రేమించుటచేత—నేను ప్రేమిస్తూన్నా, ప్రేమిస్తున్నా—నాకుకావాలి.

తల్లి : ఎవరు కావాలి?

యువ : ఆమె! హటాత్తుగ ఏడుస్తాడు. తలగడాలో తలకాయి దించుకుంటాడు, తరువాత లేస్తాడు. కిష్ట తుదుచుకుని ఇష్టతల్లేని చూపుతో అప్పుడే ప్రవేశిస్తూన్న డాక్టరు కేసి చూస్తాడు.

(డాక్టరు ప్రవేశం)

తల్లి : గుడ్ ఈవినింగ్ డాక్టర్!....

డాక్టరు : ఇంటిలో అంతా ఎట్లాగున ఉన్నారు?

యువ : గుడ్ ఈవ్నింగ్ డాక్టర్. మీ ఎదుట మాత్రం నిలువలేను. మీ డాక్టర్లనందర్నీ మీతోపాటు, మీమందు బుడ్లనీ తుత్తునియలు చేసి రంగు రంగుల మందుల్నీ యీ రక్తాన్నికూడా చెల్లాచెదరు కొట్టుదును కాని, మందు, సీసాలు, డాక్టర్లు తమ నీడలను పడేట్లా చేస్తారనే మహోద్దేశముచేత ఊరుకుంటున్నాను లేకపోతేనా....

(పట్టుదలతో ఎదో చేయబోయే వానిలా అవతలికి పోతాడు).

డాక్టరు : ఉహూఁ! అతను పిచ్చివాడుమాత్రం కాదు.

తల్లి : అతను ప్రేమిస్తున్నాడు.

డాక్టరు : అట్లాగే కనపడుతూంది.

తల్లి : అతను నిశ్చయంగా చెప్పాడు.

డాక్టరు : ఎవరిని?

తల్లి : నేనేమీ ఊహించలేకపోయినా, అతను చెప్పలేదు. కాని పిచ్చివానిలా ప్రవర్తిస్తున్నాడు దానినిబట్టి ప్రేమించేవాడు ఎట్లాగుండాలో వేరే వర్ణించనక్కర లేదు.

డాక్టరు : నిన్నరాత్రి సుఖంగా నిద్రపోయినాడా?

తల్లి : ఎప్పట్లాగే కలతనిద్ర. రాత్రిళ్లు కాదామరెత్తినట్లుగా ఉంటాడు. చీమ 'చిటుక్కు' మంటే కంగారుతో లేచి, పక్కమీంచి క్రిందకు ఉరికి, దీపం హెచ్చించి, కుర్చీల మీద, బల్లలమీద, గోడలమీద ఉన్న నీడలను చప్పట్లుకొడుతూ పిలుస్తాడు. ఏవో మరిచిపోయిన పురాతన కార్యం చేస్తూన్నట్లుగ వింతైన సైగలు జేస్తాడు. అఖరికి తన నీడను పట్టుకొనేందుకు వంగుతాడు.

డాక్టరు : వర్ణన వినటానికి కూడా వింతగా ఉంది. ఇక్కడికి కొద్దిమైళ్ల దూరంలో ఒక మాంత్రికు డున్నాడనీ, ఒక్క పలుకైనా పలుకకుండగ మంత్రశక్తిని ప్రవేశ పెట్టగలడని వాళ్లు చెప్తారు. గారడీ విద్య లేకపోతే ఒక వేళ....

తల్లి : ఇంతవరకు అతన్ని కనిపెట్టుకొని చూస్తున్నా—కాని అతను ఎక్కడికీ వెళ్లినట్లు తోచదు. ఎప్పుడూ గది విడిచివెళ్లినట్లు లేదు. ఎప్పుడూ గదినిపట్టుకొనే ఉంటాడు. ఒకవేళ బయటికి వెళ్లినట్లయితే తాను ఎంతో ప్రేమిస్తూన్న గోరీదగ్గరకే—(కంట తడిపెట్టుకొంది)

అతను యోగిలాటివాడు అస్ఖలితమైన ఎంతో మంచి కుర్రవాడు—నాకు తెలుసును, నాకు తెలుసు వాడు ప్రేమిస్తున్నాడు....

(మిగతా 19 వ పేజీలో)



# బెంగాలు వడ్డీ వ్యాపారుల చట్టము

బెంగాలులోని వడ్డీవ్యాపారులను గురించిన శాసనమొకటి, బెంగాలు ఎసెంబ్లీలో ప్రవేశపెట్టబడింది. దానిమీద చర్చలు సాగుతున్నాయి.

బెంగాలు వడ్డీ వ్యాపారుల చట్టములోని ముఖ్యాంశాలివి :

1. ప్రతి వడ్డీవ్యాపారస్థుడు లైసెన్సు పొందాలి. ఈ లైసెన్సు మూడు సంవత్సరాల కొకసారి పొందాలి. దానికి ఫీజు రు. 15 లు చెల్లించాలి. వ్యాపారపు అప్పులకు (Commercial loans) ఇది వర్తించదు. లైసెన్సుపొందని వడ్డీవ్యాపారుల దావాలపై కోర్టులో ఏవిధమైన డిక్రీలు ఇవ్వబడవు. కాని అటువంటి వ్యాపారస్థునివద్ద కొంతఅపరాధపువన్ను (Penalty) పుచ్చుకొన్న తరువాత. కోర్టువారు ఆ కేసులు కూడా విచారించవచ్చును.

2. ప్రతి వడ్డీవ్యాపారి, బెంగాలీలో సరియైన జమా ఖర్చులు అట్టేబెట్టాలి. అప్పుయొక్క షరతులు, ఎప్పుడెప్పుడు ఎంత వసూలుపెట్టినది మొదలైన వివరాలన్నీ, తెలిపే అక్కవుంటుల స్టేటుమెంటును, అప్పులో కొంతభాగాన్ని చెల్లించడానికి వచ్చినప్పుడల్లా బాకీదారుకు వడ్డీ వ్యాపారి ఇస్తూ వుండాలి.

ప్రతి సంవత్సరములోను మొదటి రెండు నెలలలో ఎప్పుడు అడిగితే అప్పుడు, తన అక్కవుంటులు సరియైనవేనని, తన సంతకంతోకూడిన స్టేటుమెంటును వడ్డీ వ్యాపారస్థుడు, బాకీదారుకు ఇవ్వాలి.

3. తాకట్టు అప్పులమీద నూటికి సంవత్సరానికి రు. 8 లు, తాకట్టులేని సాధారణ అప్పులమీద నూటికి సం॥ నకు రు. 10 లు కంటెను ఎక్కువ వడ్డీ తీసుకోకూడదు. అప్పు రద్దు అయేరోజుకి, అసలు కంటె వడ్డీ ఎక్కువ కాకూడదు.

4. అసలు, వడ్డీకలసి, (మధ్య చెల్లించిన దానితో సహా) అసలుకు రెండురెట్లు కంటె ఎక్కువ కాకూడదు.

5. డిక్రీ పొందిన అప్పు మొత్తముపైన వడ్డీ వసూలు చేయకూడదు.

6. అప్పు సొమ్ము ముట్టేటోగా అందు నిమిత్తం అయ్యే చిల్లర ఖర్చులు మొదలైనవేమీ బాకీదారు భరింపనక్కరలేదు.

7. బాకీలను గురించిన దావాలలో కోర్టువారు, బాకీదారు స్థితిగతుల ననుసరించి 10 సంవత్సరములకు మించనికాలంలో వాయిదాల ప్రకారం తీర్చుకునేటట్లు వాయిదాకు యింతయని నిర్ణయించెదరు. తాకట్టు అప్పులకు ఈ గడువు కాలం 20 సం॥ మించదు. ఏదైనా ఒక వాయిదా సొమ్ము చెల్లించనిచో ఆ సొమ్ముకు సాలుకు నూటికి రు. 3 ల చొప్పున వడ్డీ ఇవ్వవలసివుంటుంది.

8. అదనపు వడ్డీ వసూలు చేయబడిన కేసులలో కోర్టువారు పునర్విచారణ జరిపి, ఈ బిల్లు యొక్క ముఖ్యసూత్రాల ననుసరించి బాకీదారుని దానినుండి విముక్తి చేయవచ్చును. ది 1—1—39 తేదీ తరువాత చెల్లించిన అదనపు వడ్డీని తిరిగి ఇప్పించవచ్చును కూడ.

9. డిక్రీలు అమలు జరిపే సందర్భంలో అరెస్టులుగాని, కస్టడీలో వుంచడంగాని చేయకూడదు.

10. బాకీలు వసూలు చేసే సందర్భంలో బాకీవాళ్లను ఏ విధమైన హింసలు పెట్టినా (దౌర్జన్యం చేసినా, అడ్డగించినా, వెంటాడి వేధించినా, ఇంటిచుట్టూ గాని అతడు పనిచేసే స్థలం చుట్టూగాని పదేపదే తిరిగినా) దానికి ఒక సంవత్సరంవరకు శిక్ష, రు. 1000 ల వరకు జరిమానా కూడ విధింపబడవచ్చును.

ఇవన్నీ పై నుంచి చూడటానికి చాలాబాగా వున్నట్లుగానే కనబడతాయి కాని ఈ రాష్ట్రములో వడ్డీ వ్యాపారులు తమ బాకీదార్లను పెట్టే బాధలు, అప్పులపాలై పోయిన రైతుల, సామాన్య కుటుంబీకుల ఆర్థిక దుస్థితిమొదలైన విషయాలు తెలుసుకుంటేనే గాని ఈ బిల్లు వారికి ఎంతవరకు ఉపయోగకరంగా వున్నదీ తెలియదు.

## మోయలేని బరువు.

బెంగాలు రాష్ట్రంలోని అప్పుల లెక్కలు తీస్తే (భూమిశిస్తు బకాయీలతోసహా) 300 కోట్ల రూపాయలవరకు తీర్చవలసిన అప్పున్నాయి. ప్రతి సంవత్సరం అనేకమంది రైతులు భూములను గోల్పోవలసి వస్తోంది. ధరలుకూడా పడిపోయాయి. ఇట్టి పరిస్థితులలో రైతు జమీందారుకు శిస్తునిచ్చి, బాకీలు ఏమి తీర్చగలడు? శిస్తులు ఇవ్వనిచో జమీందారు పెట్టు హింస ఇంతింతకాదు. ఇది బెంగాలు రైతులకు తీరని సమస్య అయిపోయింది. కాబట్టి వారుకిసాన్ సభలద్వారా ఆందోళన గావించుతూ వచ్చారు. మారుటోరియమైనా ప్రకటించమని గోలపెట్టారు. అసలు మొత్తమును చెల్లించినచో అప్పులను రద్దు చేయమని, వడ్డీలేకుండ చేయమని కోరారు. కాని ప్రభుత్వం వారి మొరలను ఆలకించలేదు. పెపెచ్చు అట్టి ఆందోళనను దౌర్జన్యంగా అణచివేయ ప్రయత్నించింది. రైతుల భూములను లాగుకొనడంలో జమీందారుకు సాయపడింది.

## ప్రభుత్వ కర్తవ్యము.

నిజంగా రైతులను ఈ అప్పులబాధనుండి రక్షించదలచుకొంటే ప్రభుత్వము పాతబాకీలన్నీ రద్దు చేయవలసియుంటుంది. కనీసము రైతులు కోరినట్లు అసలు మొత్తాన్ని చెల్లించిన బాకీలన్నీ రద్దుఅయేటట్లు శాసనంలో ప్రకటించవలసి వుంటుంది; వడ్డీని రద్దుచేయవలసి వుంటుంది: అప్పులను ప్రస్తుత ధరలనుబట్టి ఆ ప్రమాణాలలో తగ్గించవలసి వుంటుంది. ఈ పనులుచేస్తూ ప్రభుత్వం నుండి చౌకగాను సులభంగాను అప్పులుదొరికే ఏర్పాటుసుకూడా చేయవలసి వుంటుంది. ఇవన్నీ సాధ్యంకాని పనులవలె తోచవచ్చు. కాని నేటి బెంగాలు రైతుల ఆర్థిక స్థితినిబట్టిచూస్తే ఇవి అత్యవసరంగా చేయవలసిన సదుపాయాలుతప్ప మరేమీకాదు. కాని బెంగాలు ప్రభుత్వం ఈపనులు చేయదు. అట్లాచేస్తే అదనపు పోలీసు గ్రాంట్లు తమజీతాలు, టీపార్టీలు మొదలైన వాటికి రెవెన్యూ ఆదాయం చాలదు.

## అసలు రహస్యం

అయితే ఈ బిల్లు ప్రవేశపెట్టడంవలన రైతులకు ఏమీ లాభమేలేదా? ఈ బిల్లు వలన వడ్డీవ్యాపారులను ప్రభుత్వం అదుపాజ్ఞలలో నుంచుటలేదా? అని అడుగవచ్చు. నిజానికి ఈ బిల్లువల్ల ఇప్పుడు రైతు బాగుపడేది ఏమీ లేదు ఎందువల్లనంటే, అసలు అప్పులే తీర్చలేని స్థితిలో నున్న రైతులకు దానికి తగిన పరపతి గలిగేటట్లు ఆ ఋణబాధనుండి విముక్తి చెందేటట్లు చేయడం పోయి వడ్డీ వ్యాపారులకు లైసెన్సు పెట్టినంత మాత్రాన, అక్కవుంట్లు చూపాలన్నంతమాత్రాన, వారు ఒక్కసారిగా ఆర్థిక దుస్థితినుండి బైటపడజాలరు. వడ్డీవ్యాపారులకు కొన్ని నిబంధనలు ఏర్పరచుట మంచిదే. దానితోపాటు ఋణ విముక్తికి రైతులు కోరుతూన్న సదుపాయాలుకూడా చెయ్యాలి. కాని వట్టి కీయాక్షనరీ మంత్రివర్గమైన హక్ మంత్రివర్గం, ఈ మాత్రం బిల్లును తేవడం గొప్ప విషయం కాదా! అనికూడ అనవచ్చు. ఇందులో హక్ మంత్రివర్గం ప్రయత్న మేమీ లేదంటాము. రైతులు, కార్మికులు చేస్తూన్న ఆందోళనా ఫలితంగా ఈ బిల్లు వచ్చింది. అంతేకాదు. రైతు ఉద్యమం, వారిలో నానాటికి ఎక్కువౌతున్న వర్గ చైతన్యం, హక్ మంత్రివర్గపు పునాదులనే కదలించి వేస్తోంది. అందుచేత తన అస్థిత్వాన్ని కాపాడుకోడానికి ఈ విధంగా రైతులను మోసగించడానికి, వారి దృష్టి నాకర్షించడానికి, ప్రజా ఉద్యమాన్ని నాశనం గావించడానికి, వారిని మభ్యపెట్టడానికి చేస్తున్న పని ఇది. ఇదిగాక ఇంకో రహస్యం కూడా వుంది. మళ్ళీ రెండు సంవత్సరాలలో ఎన్నికలు రాబోతున్నాయి అందుచేత ఇప్పుడిల్లాంటి చట్టాలు ఒకటి, రెండు చేసినట్లు కనబడితేగాని అప్పుడు రైతులవద్దకు ఓట్లకోసం వెళ్లడానికి వీలుండదు. లేకపోతే ఒక మూలనుంచి బర్ద్వాన్‌కు ప్రత్యేక పోలీసు దళాలను పంపుతూ, కిసాన్ మీటింగులను నిషేధిస్తూ, రైతులను కార్మికులను జైళ్లకు పంపుతూ, ఒక్క నెల రోజులలో నాలుగు పత్రికలను వెయ్యేసి రూపాయలు ధరావతు కట్టమని శాసిస్తూ, ఇక్కడ మేము రైతు క్షేమం కోరుతున్నానుని ఈ బిల్లును తేవడం నిజంగా రైతు శ్రేయం కోరే చేస్తున్నారని ఎట్లాగు నమ్మడం? అట్లా అని ఈ బిల్లు అక్కరలేదనము. తప్పక కావాలి. కాని అందులో రైతులు కోరే యీ మార్పులు కావాలి (1) అసలు మొత్తమును చెల్లించిన అప్పులు రద్దుకావాలి. (2) వడ్డీ పోవాలి. (3) ప్రస్తుతపు ధరల పతనాన్నిబట్టి అప్పును సర్దుబాటు చేయాలి. (4) ప్రభుత్వమే రైతులకు అప్పుల నివ్వాలి.

వ్యాసకర్త :
కామ్రేడ్ సోమనాధ్ లహరీ.

## జూన్ 18 ఆదివారము ప్రెస్ వర్కర్సు డే

ప్రెస్ కంపోజిటరే నేడు అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా పనిచేయుచున్న డిమిట్రాఫ్ జన్మదినము ప్రెస్‌వర్కర్సు దేగా జరుపుటకు యేలూరులో జరిగిన ఆంధ్రరాష్ట్రప్రెస్ వర్కర్సు యూనియన్ తృతీయ మహాసభ యందు తీర్మానించబడెను. డిమిట్రాఫ్ జన్మదినము జూన్ 18. ఆరోజు "ప్రెస్ వర్కర్సు డే"గా భావించి ప్రెస్ వర్కర్సు కనీసపు కోర్కెలకొరకు బహిరంగసభలు, ప్రదర్శనాలు జరిపి ఆందోళన చెయ్యాలని స్థానిక సంఘములను కోరుచున్నాము.

పిల్లలమర్రి వెంకటేశ్వర్లు,
కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర ప్రెస్‌వర్కర్సు యూనియన్.

టెక్స్టైలు కార్మికులు

# దేశమంతటా సమ్మెకు సంసిద్ధులగు చున్నారు

టెక్స్టయిల్ పరిశ్రమ మన దేశములో దాదాపు అన్ని రాష్ట్రాలయందు వ్యాపించి, సంస్థానాలందుకూడా అభివృద్ధి చెందింది. మన బ్రిటిష్ ఇండియాలో షుమారు 8 లక్షలమంది యీ పరిశ్రమలలో పని చేయుచున్నారు. ఈ పరిశ్రమ కేంద్రము లన్నిటిలో బొంబాయి, కాన్పూరు, అహమ్మదాబాదు, నాగపూరు మొదలగునవి ముఖ్యమైనవి. ఈ పరిశ్రమ యభివృద్ధి చెందుచూ వచ్చిన 20 సంవత్సరముల లోను కార్మికులు 8 సార్లు జనరల్ స్ట్రయిక్‌లు చేసారు. అనేక తడవలు రాజకీయ సమ్మెలలో కూడ పాల్గొన్నారు. ఈ కార్మికులు భారత కార్మికవర్గములో ఎక్కువ చైతన్యం పొందినవారు.

1934 లో టెక్స్టయిల్ కార్మికులు జరిపిన జనరల్ స్ట్రయిక్ అనంతరం దేశ వ్యాపిత సమ్మె జరుగలేదు కాని అన్ని కేంద్రముల యందును సమ్మెలు జరుగుచునే యున్నవి. కాంగ్రెసు మంత్రుల పదవిస్వీకారం పిదప ఈ పరిశ్రమ కార్మికులందు చెలరేగిన సంచలనము వలన మన దేశములో జరిగిన సమ్మెలలో షుమారు 100 కి 40 యీ పరిశ్రమలలోనివే.

1938 వ సంవత్సరములో 129 సమ్మెలు జరిపిరి. 170 వేలమంది పాల్గొనిరి కొన్ని చోట్ల కార్మికుల స్వల్ప వేతనాభివృద్ధి పొందినా ముఖ్య సమస్య లేవీ పరిష్కరించబడలేదు. బొంబాయి కాంగ్రెసు మంత్రులు బొంబాయిలో కార్మికులందు చెలరేగిన సంచలనమును గ్రహించి, వారి పరిస్థితులను విచారించుటకు విచారణ కమిటీని నియమించారు. కాని యీ కమిటీ నియామకము అక్కడి పెట్టుబడిదారులకు కంటకముగా ఉండి అనేక అభ్యంతరములు కలిగించిరి. యీ కమిటీ నూటికి 12½ వంతున యెట్టి పరిస్థితులలోనైననూ జీతములు అధికము చేయవలెనని సూచించింది. మధ్య రాష్ట్రాలలో కూడ విచారణ కమిటీ నియామక ఫలితముగా కార్మికులకు 1932 జీతముల కోత నూటికి 50 వంతున తగ్గించబడినది. సంయుక్త రాష్ట్రాలలోని, కాన్పూరులో కార్మికులు జనరల్ స్ట్రయిక్ చేసారు. తత్ఫలితంగా అక్కడి మంత్రివర్గం బాబూ రాజేంద్ర ప్రసాదుగారి అధ్యక్షత క్రింద విచారణ కమిటీని నియమించింది. ఆర్థిక దుస్థితియందు గావించబడినజీతపు కోతను తొలగించాలని సంఘాన్ని గుర్తించుట,ఆదిగాగల అత్యవసర కోర్కెలను నెరవేర్చాలని సూచించి చింది కార్మిక సంఘాలు. కాంగ్రెసు మంత్రులు ఒత్తిడివల్ల యజమానులు. యజమానులు జీతము అధికము చేయవలసి వచ్చిందేకాని, విచారణకమిటీచేసిన మిగిలిన సూచనలు అమలు జరుపలేదు. మన మద్రాసు రాష్ట్రంలో యీ కార్మికులందు అనేక సమ్మెలు జరిగినవి. పరిస్థితులనుగూర్చి విచారణకమిటీ నియమించక దాని ...ననూ ప్రత్యేక సమయములందు విచారణ నిష్కర్ష కమిటీలను నియమించారు. కొన్ని (....)తములు అధికము చెయ్యాలని వగైరా తర్ల : ఏమి ...నలు విచారణ కమిటీ తెలియ దాని : అతన్ని దేశమునకు ...ర్తిగా వీనిని అమలు యి. అమ్మా! ఈ

జరుపలేదన్నది. మొత్తముమీద యీ పారిశ్రామిక కార్మికులందున పుద్భవించిన అసంతృప్తి కాంగ్రెస్ మంత్రివర్గం అధికారములోనికి వచ్చిన తరువాతకూడ తొలగలేదు.

కాన్పూరులో జనరల్ స్ట్రయికు పరిష్కరింపబడినప్పటి నుంచి యజమానులు కార్మిక సంఘములో చీలికలు గల్గించుటకు అనేక కృత్రిమ యెత్తుగడలను వేసిరి. బొంబాయికార్మిక సంఘాలలో చీలికలు కలిగించి యజమానుల చెప్పుచేతలలోయుండు సంఘములునిర్మించుటకు కారణభూతుడైన ఆల్లిన్‌అను ప్రముఖుని కాన్పూరుకు తెచ్చిరి. కార్మికులను పనిలోనుండి తొలగించుటకు ప్రయత్నించిరి కాని, కార్మికుల సంయుక్త ప్రతిఘటనవల్ల యజమానులు మిన్నకుండవలసి వచ్చింది. అంతేగాక మతద్వేషమును పురికొల్పుటకు కొంతమంది దుండగీడులను పనిలో చేర్చుకొనిరి. ఇతర మార్గాలు విఫలమగుటవల్ల మొన్నమొన్న జరిగిన మత కలహము లన్నియు యజమానులు ప్రేరేపించిరి. కాని, యీ మతోద్రేకపుమత్తు స్వీకరించుటకు కార్మికులు నిరాకరించిరి. దురదృష్టవశాత్తు, యీ మతకలహాల వెనుక దాగివున్న జమీందారు పెట్టుబడిదార్లకుట్ర మధ్య తరగతి ప్రజాసామాన్యము కనిపెట్టలేక పోయినది. ఈ మతకలహములు అణచుటకు కాంగ్రెసు మంత్రులుకూడ సరిఅయిన పంథా త్రొక్కలేదు. అందువలన వీరిలో కొంత చీలికలు మత కలహములు కలుగచేసినవి. పెట్టుబడిదారుల కుతంత్రము కొంతవరకు నెరవేరినది. జనరల్ స్ట్రయిక్ సమయంలో సమకూడ ప్రజాఐక్యతను మతవైషమ్యాలతో చీల్చ కల్గిరి విమ్మట యజమానులు కార్మికులపై దాడి సాగించిరి. 400 మందని పనిలోనుండి తొలగించిరి. నూటికి 12½ వంతున జీతాలు తగ్గించాలను భావమును వెల్లడించారు. రేషనలైజేషనుపద్ధతిని ప్రవేశపెట్టుటకు పూనుకొన్నారు.

ప్రత్యక్ష పోరాటముతో యావత్ ప్రజాయైక్యతను యాచరణలోనికి తెచ్చిన కాన్పూరు కార్మిక శ్రేణులు మరియొక తీవ్రప్రతిఘటన జరుపవలసిన యావశ్యకతను గుర్తించారు. ఒక నెలరోజులలో కార్మిక సంఘములో 3½ వేలమందిని చేర్పించుటకు: డిపార్టుమెంటల్ కమిటీలు పనిచేయించుటకు, 2500 వాలంటీర్ల దళమును నిర్మించుటకు సంకల్పించారు.

బొంబాయిలోకూడ దేశీయ పెట్టుబడిదారులు కూడ కాన్పూరు యూరోపియన్ పెట్టుబడిదారుల పంథానే అవలంబించారు. 30 వేల మంది రాత్రి పని చేయువారిని మాన్పించారు. కాంగ్రెస్ మంత్రులచే గావింపబడిన విచారణ కమిటీ సూచించిన నూటికి 12 చొ॥ జీతముల హెచ్చును రద్దుచేయుటకు యజమానులు సంకల్పించిరి.

మద్రాసు రాష్ట్రములోకూడ విచారణకర్తల తీర్పును యజమానులు వుల్లంఘించిరి. మధ్య రాష్ట్రాలందుకూడ, కార్మికులు విచారణ కమిటీ వల్ల పొందిన సౌకర్యములు సంకుచితపరచబడి

పూర్తిగ రద్దుచేయుటకు ప్రయత్నించుచున్నారు.

కాన్పూరు యూరోపియను పెట్టుబడిదారులు కార్మికులపై తమదాడిని సమర్థించుకొనుటకు నరుకు నిలువయున్నదనీ, ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా ఇండో-బ్రిటిష్ ఒడంబడిక సైసాయి సర్దిపైచేయుటతో మనదేశ పరిశ్రమలకు రక్షణ తగ్గినదని, అందువలన విదేశస్థుల పోటీకి ఢీకొనలేక పోవుచున్నారని, ప్రత్తిమీద దిగుమతి పన్ను విధించుటచే వ్యాపారం మందగించినదనీ యీ కారణాలవల్ల పరిశ్రమ నిలవ త్రొక్కుకొనుటకు కార్మికుల జీతాలు తగ్గించిననేకాని లాభములేదని ప్రచారము చేయసాగిరి. కాని ఇండో-బ్రిటిషు సంధివలన యీ పరిశ్రమకు కొంత లాభములు తగ్గిననూ, పరిశ్రమ యింకనూ లాభములతోనే నడచుచున్నదని పెట్టుబడిదారుల లెక్కలే తెలియచేయుచున్నవి. అంతేగాక పరోక్షముగా గత సంవత్సరాలకంటే 1938-39 లందు ఇంకా ఎక్కువ లాభం వస్తుందని బొంబాయిమిల్లు యజమాను సంఘాధ్యక్షులు తెలియచేశారు. అందువల్ల పరిశ్రమలు నశించునను భయమువిల్ల కాదు; యజమానులు కార్మికుల వేతనము తగ్గించుచున్నది.

ప్రస్తుతము యూరోపియన్ పెట్టుబడిదారులు లేవతీసినదాడి కేవలము కార్మికులను దోచుకొనువిధానము మరింత తీవ్రము చేయుటయే కాక, రాజకీయంగా కాంగ్రెస్ మంత్రులను ప్రతిఘటించి, ప్రజోపకరములగు శాసనములు చేయకుండుటకు పన్నిన పన్నాగము. కాంగ్రెస్ మంత్రులు రైతు చట్టాలు, కార్మికుల విషయం జోక్యము కలిగించుకొని, పెట్టుబడిదారుల అత్యాచారములకు ఆటంకములు కలిగించుట, యివికాక ప్రజోపకరములగు పనులు నెరవేర్చుటకు పెట్టుబడిదారులపై అధికపన్ను విధించుట జరిగేటప్పటికి, యూరోపియన్ పెట్టుబడిదారులు యేకమై, కాంగ్రెస్ మంత్రివర్గమును ప్రతిఘటించుటకై ఒక కూటమిగా యేర్పడిరి. కాంగ్రెస్ మంత్రివర్గాలు తమ విచారణ కమిటీ రిపోర్టులను ఆచరణలో పెట్టించుటకు యజమానులపై యెట్టి ఒత్తిడి కలుగజేయకపోవుటవల్లను బొంబాయి, మద్రాసు మంత్రివర్గాలు కార్మికుల సమ్మెలకు అనుక్షణం వ్యతిరేకప్రచారము చేయుటవల్ల పెట్టుబడిదారులు మరింత ధైర్యముతో తమ పంథాను సాగించుచున్నారు. కార్మికులకు, యజమానులకు జరుగనున్న సంఘర్షణ, కార్మికులు ప్రజాసామాన్యము-కాంగ్రెసు మంత్రులకు వ్యతిరేకముగా యూరోపియన్ పెట్టుబడిదారులు, బ్రిటిషు ప్రభుత్వం జమీందారులకు జరుగనున్న పోరాట భాగమని గుర్తించాలి. ఈ జీతముల తగ్గింపు, రేషనలైజేషను విధానము ఒక్కొక కేంద్రమునందు ప్రారంభించబడి చివరకు దేశమంతట వ్యాపించును.

ఇప్పటి యీ పరిశ్రమ కార్మికులు కొన్ని కొన్ని మిల్లులందు కేంద్రములందు సమ్మెచేసిరి. కాని వారి సమస్యలు యేవి పరిష్కరింపబడ లేదు. అందువలన దేశవ్యాపిత సమ్మె తప్ప

వేరే గత్యంతరము కన్పడుటలేదు. ఈ యవసరమును గుర్తించి వారిచే గిర్నీ కాంగారు యూనియన్, అఖిల భారత టెక్స్టయిల్ కార్మికుల ప్రతినిధుల మహాసభ జరిపి అందు జనరల్ స్ట్రయిక్ విషయము ఆలోచించాలని సూచించారు. ఈ సూచనను దేశమందలి యీ పరిశ్రమ కార్మికులు అందుకొని మహాసభను జరుపుకొంటారు. 1934 జనవరిలో జనరల్ స్ట్రయిక్ చేయుటకు తీర్మానించినా అప్పుడు యన్. యం. జోషి మున్నా పాల్గొనలేదు. అప్పటికంటె యిప్పుడు అనుకూల వాతావరణ కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడుట యే కాక, ప్రజా సామాన్యముకూడ కార్మికుల కోర్కెలు నెరవేర్చుటలో కాంగ్రెస్ మంత్రులే విఫలమగుటవల్ల కార్మికులు సమ్మె చేయవలసిన యావశ్యకతను గుర్తించి కార్మికులకు సానుభూతి చూపుచున్నారు.

అంతేకాక, 1933-34 లందు కార్మికోద్యమందలి యైక్యత భంగపడినది. ప్రస్తుతము యీ యైక్యత తిరిగి నెలకొల్పబడినది. యన్. యమ్. జోషి దృక్పథముగల నాయకులుకూడ బ్రిటిషు ప్రభుత్వంవైపు న్యాయవిచక్షణ యందు నమ్మకము పూర్తిగా నశించి, కార్మికులకు ప్రత్యక్షపోరాట గత్యంతరమును గుర్తించుచున్నారు వీరికి ప్రజాసామాన్యము యొక్క సానుభూతియేగాక, ప్రజాసామాన్యము యీ కార్మికుల పోరాటము జాతీయ పోరాట భాగముగా భావించి ప్రత్యక్షముగా కార్మిక పోరాటములో పాల్గొనాలి. మన దేశీయ పెట్టుబడిదారులు కాంగ్రెస్ మంత్రివర్గాలను యూరోపియన్ పెట్టుబడిదారులతో కలసి ప్రతిఘటించచూచుట కడుశోచనీయము. వారు ఇండో-బ్రిటిషు సంధికి వ్యతిరేకముగా జాతీయవాదశక్తులన్నిటితో కలివాలి కాని, జాతీయ ఉద్యమములో యొక భాగమైన కార్మికులపై దండయాత్ర సల్పుట దేశద్రోహం.

ఇండో-బ్రిటిషు పాక్టుకు వ్యతిరేకముగా ఇంగ్లండు వస్తుబహిష్కరణము, కార్మికుల కోర్కెలు గ్యారంటీచేసి, బ్రిటిషు వస్తువులను స్టీమర్లలోనుంచి దింపకుండునట్లు చేయుటకు పూనుకొనాలి. ఇప్పటికైననూ, మనదేశ పెట్టుబడిదారులు ఇందుకు అంగీకరించుటకు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ పూనుకొనాలి. కార్మికులకు అన్నివిధముల కాంగ్రెస్ మహాసభ సహకారముచేసి ప్రత్యక్షముగా కార్మికవర్గముపై, పరోక్షముగా కాంగ్రెస్ మంత్రులపై పెట్టుబడిదారులు, యితర దేశద్రోహులు జరుపనున్న దాడిని యెదుర్కొనాలి. పూర్వం జరిగిన సమ్మెలలో కొన్నింటికి (బి. యన్. ఆర్. రైల్వే-జ్యూటు మొదలైనవి) కాంగ్రెస్ మహాసంస్థ ధనసహాయము మాత్రమే చేసింది. కాని కాన్పూరు కాంగ్రెస్ కమిటీ ప్రత్యక్షంగా పాల్గొన్నది. అదేవిధముగా మన దేశములోనికి కాంగ్రెస్ కమిటీలు కార్మికులకు ప్రత్యక్షముగా సహకారము చెయ్యాలని తీర్మానించాలి.



# ఛాంబర్లేను మళ్ళా హిట్లర్‌ను లాలిస్తున్నాడు!

## డాంజిగ్‌కు హిట్లర్ ఎసరు పెట్టాడు.

## స్పెయిన్‌ను ఇటలీ జర్మనీలు కాలిక్రింద రాస్తున్నాయి!

క్రిందటిసారి స్పెయిన్‌నుండి ఇటలీ జర్మనీ సైనికులు తిరిగివచ్చారని వ్రాశాం. అప్పటి నుండి ఇటలీ జర్మనీల ప్రకటనలు విస్మయాన్ని కల్గించకపోయినా అతి ప్రాముఖ్యమైనవి.

ఫ్రాంకో స్పెయిన్‌ను జయించినాడన్న మాటేగాని తిండి కరవైంది. బాంబులవల్ల ధ్వంసమైన స్పెయిన్‌ను పునర్నిర్మించాలంటే ధనమవసరం. ఇలాంటి పరిస్థితులు కల్పించి, తమ ఋణాలనిచ్చి, స్పెయిన్‌ను ఉపయోగించుకోవాలనే ద్రోహంచేసాయి బ్రిటన్ ఫ్రాంసులు కాని అలాంటి అవకాశం గల్గకుండా ఇటలీ జర్మనీలు ఒకకంట కాస్తున్నాయి. స్పెయిన్‌కు ఎట్టి ధనసహాయం తలపెట్టలేదని బ్రిటిషు ప్రధానిచెప్పినా, మే రెండవవారంలో వాంజీలాండ్ (బెల్జియం పూర్వప్రధాని) 20 లక్షల పౌనులు అప్పు ఇవ్వడానికి, సంప్రదింపులకై స్పెయిన్ వెళ్ళాడని "న్యూస్ రివ్యూ" వ్రాస్తున్నది. ఇలాంటి ప్రయత్నాలకు భయపడే హిట్లర్ ముస్సోలినీలు జాగ్రత్తపడుతున్నారు. స్పెయిన్‌నుండి తిరిగివచ్చిన జర్మన్ సైనికుల ముందు మాట్లాడుతూ 6వ తేదీన హిట్లరు తాను మొదట నుండీ తిరుగుబాటుకు సహాయం చేశానన్న సంగతిని ఒప్పుకున్నాడు. ఇక ముస్సోలినీ వంతు. జూన్ 8 వ తేదీన స్పానిష్ మంత్రికి 'సీనర్ సూనర్'కు విందుగావిస్తూ ముస్సోలినీ ఇలా అన్నాడు.

"స్పెయిన్ బలాబలాలు చూచుకొనేందుకు అగ్నిపరీక్ష. అందుచేత మొదటి రోజునుండీ, చివరి విజయంవరకు మీకు బహిరంగంగా సహాయం చేయడానికి మేము వెనుదీయలేదు."

ఇంకోచోట వలంటీర్లను గూర్చి మాట్లాడుతూ 'వారు 30 నెలలదాకా ప్రజాస్వామ్య ప్రభుత్వాలకు గుండెబెదురుగా ఉన్నారు' అని అన్నాడు. స్పెయిన్‌ను బోల్షివిజంనుండి తాము రక్షించారట! ఇంకా "మేము మీకు వీడ్కోలు అనము. ఎందుకంటే మీకు మాకూ ఎడతెగని సంబంధం ఇకమీద కూడా ఉంటుంది గనుక" అని అన్నాడు. ఇంతేగాక స్పెయిన్ తాము గావించిన ఘనకార్యాలను గురించి ఇటలీ ఇలా చెప్పుకొంటున్నది.

"1936 డిసెంబరు మొదలుకొని 1937 ఏప్రిల్‌లోగా ఒక లక్షమంది మనుష్యులు 4730 కాపులు, 40,000 టన్నుల యుద్ధసామగ్రి, 750 ఫిరంగులు దిగుమతి చేయబడ్డాయి."

ఇవే గాక మరికొన్ని లెక్కలు ఇటాలియన్ పత్రికలలో ప్రకటించబడినాయి.

స్పెయిన్ యుద్ధంలో "175 మంది ఇటలీ వాళ్ళు చనిపోయారట. 192 గురు గాయపడ్డారట. 5,318 సార్లు బాంబులు వేసారట. 2700 టన్నుల బాంబులు వేశారట. 86 మెషిన్‌గన్‌లు పోయాయట. 266 విమాన యుద్ధాలలో పాల్గొన్నారట." ఈ లెక్కలు ప్రకటించడంలో అర్థం ఏమిటి? స్పానిష్ మంత్రికీ, ఇటలీ విదేశాంగ మంత్రి కియానోకు జరిగే సంభాషణల అర్థం ఏమిటి? ఫ్రాంకోను బ్రిటిషు వారి వలలో పడకుండా తమ కాలిక్రిందనే అణచిపెట్టికొనేందుకే. ఈ రాయబారాలు "వర్తక, ఆర్థిక, రాజకీయ ఒడంబడికలలో అడ్డు లేకుండా స్పెయిన్ ఎల్లప్పుడూ రోం-బెర్లిన్ కూటమికి అంటగట్టుకొని ఉండటానికే." అని వార్త.

ఇలా చేస్తున్నప్పటికీ ఇటలీ-జర్మనీలు స్పెయిన్‌ను జయించారనడాన్ని హేళన చేస్తూ హిట్లర్ "సాధారణంగా ఇలాంటి అభిప్రాయాలు కాలనీలను (వలసదేశాలను) దొంగిలించడానికి అలవాటు పడ్డ దేశాలకే గల్గుతుంది"అని బ్రిటన్ ఫ్రాంసులను ఎత్తిపొడిచాడు.

కాని, డాక్టర్ వాహగ్‌టాట్‌ను స్పెయిన్‌ను ఆర్థిక ఒడంబడికలను సన్నిద్ధం చేయడానికి పంపాడు. స్పెయిన్‌లో గనులు, ముఖ్యంగా ఇనుము జర్మనీకి కావాలట అందుకోసం అక్కడ గనులలో పరిశ్రమలు స్థాపించుకొనే హక్కును తన కీయమని అడగటానికే ఈతని రాయబారం. త్వరలోనే ఇలాంటి కార్యానికే కౌంటుకియానో (ఇటలీ విదేశాంగ మంత్రి) స్పెయిన్‌కు వెళ్ళబోతున్నాడు. ఈ విధంగా ఆర్థికంగా,దోపిడిచేసి తమ కాలిక్రింద ఫ్రాంకోను అట్టిపెట్టడానికి ఇటలీ జర్మనీలు ప్రయత్నిస్తున్నాయి.

## ఫేసిస్టుల యుద్ధప్రయత్నాలు

స్పెయిన్‌ను విద్రోహులగు ఫేసిస్టుల కప్పజెప్పడంలో బ్రిటనుకే ముప్పు వచ్చింది జిబ్రాల్టర్‌కే తిన్నగా దెబ్బగొట్టడానికి అవకాశం ఏర్పడింది ఇపుడు రోమ్-బెర్లిన్-మాడ్రిడ్‌ల మధ్య సంభాషణలు సాగుతున్నాయి. "సోవియట్ యూనియన్, బ్రిటనుల మధ్య సంధి కుదిరితే తిరిగి దెబ్బ గొట్టడానికి సిద్ధంగా ఉన్నాయి" అనీ, జపానుతోకూడ సంప్రదింపులు సాగుతున్నాయనీ వార్త. ఇంతేగాదు. 'టెవెరే' అనే పత్రిక ఇలా వ్రాసింది. "ఇటలీ జర్మనీల వైమానిక దళాలను కల్పడమే గాదు, రెండుసంస్థల్ని కలపాలి, విమాన కేంద్రాల దృక్పథాన్ననుసరించి ఫ్రాంసు, తన యొక్కగాని, బ్రిటన్‌యొక్కగాని, సైన్యాలను దిగుమతి చేయగలనని తలిచే రేవుల మీద; బ్రిటిషు సైన్యాలు దాట తలిచే రేవులమీద; బాంబులు వేయడానికి, ఈ రెండూ కలపాలి." ఇలా ఫేసిస్టు దేశాల మధ్య సంప్రదింపులేగాదు, ఇతర చిన్న దేశాలతోటి సంబంధబాంధవ్యాలను హిట్లర్ వృద్ధిచేస్తుకొంటున్నాడు.

యుగోస్లేవియా రాజుమారుడు పాల్ జర్మనీ పర్యటనం ముగించి ఇంటికి వెళ్ళాడు. "ఈరెండుప్రభుత్వాలు తమసంబంధాల్ని ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక విషయాలలో ఎక్కువగా వృద్ధిచేసుకొంటానికి నిశ్చయించుకొన్నారు." అని వార్త. ఇదివరకే సూచింపబడినట్లు జూన్ 7-వ తేదీన జర్మనీ బాల్కన్ రాష్ట్రాలతో తటస్థపు టొడంబడిక గావించుకొన్నది. లాట్వియా-ఇస్తోనియాంతో సంధి గావించుకొంది, ఇదివరకే లిథూనియాతో వర్తకపు టొడంబడిక గావించుకొన్నది. ఫిన్‌లాండు విదేశమంత్రి శాసన సభలో మాటాడుతూ "మేము కోరకుండానే ఎవరయినా మాకు సహాయం చేస్తే అది దాడిగా భావించి తిరుగగొడతాం." ఈ ఉపన్యాసం బాల్కన్ రాష్ట్రాల విషయమై సోవియట్ కోరిన హామీకి అడ్డు దగిలేందుకు ఉపయోగిస్తుంది. ఈ విధంగా యుద్ధ సన్నాహాలు గావిస్తూ, జర్మనీ తన సామ్రాజ్యంలో కలిగిన తిరుగుబాట్లను అణచివేస్తున్నది

## జకోస్లొవేకియా తిరుగుబాటు

జర్మనీ తన 'రక్షణ' క్రిందకు జకోస్లొవేకియాలోని బొహీమియా,మొరేవియా రాష్ట్రాలను మార్చినెలలో తీసుకొన్ననాటినుండి అశాంతి తగ్గలేదు. ఏదోవిధంగా అక్కడక్కడా అల్లర్లు జరుగుతూనే వచ్చాయి

"హిట్లర్ 50 వ జన్మదినోత్స సందర్భంలో ప్రేగ్‌లో 'హస్స్ జ్ఞాపకచిహ్నం' పూజింపబడుతుందని ఆనోటా ఆనోటా చెప్పారు సాయంకాలానికి 30 వేల పూలతో అభివాదాలు తెల్పారు. పూలను 'సత్యం జయించుతుంది' అనేఅక్షరాలుగా అమర్చారు తర్వాత పోలీసులు ప్రజలను నిర్బంధించి దానిని చిందరవందర చేయించారు." అని టైమ్సుపత్రిక వ్రాసింది.

మొట్టమొదట జర్మనీ సబ్బులూ, రొట్టెలూ పంచిపెడుతూవచ్చినా, తర్వాత జక్ ఆఫీసర్లను 100 కి 80 మందిని తొలగించి జర్మనీవారిని నియమించింది. ఇంతేగాక 'స్కోడా' ఆయుధాగారంలో కూడ జక్ పనివాండ్రను తొలగించివేయసాగింది. జర్మనీయెడల అసమ్మతి చూపడానికిగాను ఫ్యాక్టరీలలో ద్రోహం (సాబటేజ్) చేయుట, కార్లు ఢీకొనటం మొదలయిన యాక్సిడెంట్లు వృద్ధిచేసి జర్మనులను చంపుట సాగించుతూ వచ్చారు.

వీటినన్నిటినీ ఎదుర్కొడానికి జర్మనీ తీవ్ర నిరంకుశ నిర్బంధవిధానం సాగించింది. సందేహం గలవాళ్ళ పేర్లన్నీ ఒక రిజస్టర్‌లో వేస్తున్నారు జర్మన్ పోలీసులు. రేపు యుద్ధమవస్తే వీరినందరినీ జైళ్ళలో పారెయ్యవచ్చు. ఇప్పటికే ఇతర దేశాలనుండి తల దాచుకోడానికి జకోస్లొవేకియాకు వచ్చిన వారిని 20 వేలదాకా అరెస్టు గావించారు. ఉత్తరాలు, టెలిగ్రాములు, టెలిఫోను సంభాషణలను 'సెన్సార్' చేయడమేగాక, పత్రికలు, రేడియోలు అంతా జర్మనీ అధికారం క్రిందకు లాక్కువచ్చారు. ఇది పూర్వకథ.

ఇపుడు క్లాడనోవద్ద ఒక జర్మన్ పోలీసు ఆఫీసరు చంపబడ్డాడట! దానితో నాజీ పైశాచికత్వం మరింత వృద్ధిఅయింది క్లాడ్నో మేయరును పదవినుండి తొలగించారు. జక్ పోలీసుల ఆయుధాలను లాక్కొన్నారు. బహిరంగసభలు జరుపరాదంటూ నిషేధించారు. మరుసటి దినం (జూన్ 9) 8 గంటలలోగా హత్యచేసిన వాణ్ణి ప్రజలుపట్టి ఈయకపోతే, ఇతర విధానాలు అవలంబించుతామని తెలియజేశారు.

క్లాడ్నోజిల్లా 5 లక్షల జక్‌క్రౌన్లు (నాణాలు) జరిమానాక్రింద చెల్లించాలని వాన్‌న్యూరత్-రక్షకుడు-మరుసటి దినం ప్రకటించాడు. ఇదే ఇతర విధానం! తర్వాత కర్ఫ్యూ ఆర్డర్ ప్రకటింప బడింది. ఈ జరిమానా "యూదులూ, పూర్వపు అధ్యక్షుడు బెనెసును సపోర్టుచేసేవారూ" చెల్లించాలట. ఇంతేగాక సినిమాలు, స్కూళ్ళు, నాటకశాలలు, ఇతర ప్రజాసంస్థలు మూసివేయాలని, తెరిస్తే 'కాల్చి చంపుతామని' ప్రకటించారు. ఇంతకంటే జర్మనీ పైశాచిక కృత్యాలను చెప్పనవసరం లేదు.

బొహీమియాను పూర్తిగా జర్మనీక్రింద ఉంచుకొంటూ, జక్ కార్మికులచేత జర్మనీ భూములపై పని చేయించు కొంటున్నారు, జర్మనులు.

దీనిని బట్టి జకోస్లొవేకియా స్వాతంత్ర్య ఉద్యమం చావలేదని తేలుతుంది. జర్మనీ ఆక్రమించుకొనే దినాలలలోనే అనేక ప్రాముఖ్యమైన మిలటరీ పరికరణ నాశనం చేయబడింది. ఒక మిలటరీ ఆఫీసరు పోలండు పారిపోయి 50 వేలమంది జక్కుల దళాన్ని తయారు చేశాడు. బ్రిటన్, ఫ్రాంసు, అమెరికాలలో జకోస్లొవేకియా విషయమై ఆందోళన సాగుతూనే ఉంది. ఇలా జకోస్లొవేకియాను అణచుతున్న జర్మనీకి, బ్రిటన్ తనవద్ద దాచిన జక్ బంగారాన్ని ఇచ్చివేయ నిశ్చయించింది. దానికి ఏవేవో శ్రీరంగనీతులు - అంతర్జాతీయ ఆర్థిక నీతి సూత్రాలు-బోధించుతుంది.

## బ్రిటన్: జపాను

ఒక ప్రక్క యూరప్‌లో ఫేసిస్టులు తమను బలపరచు కొనుటే గాక జపానుతో కూడ అవసరమైతే మిలిటరీ ఒడంబడిక గావించుకొంటామని బెదరించుతూ వచ్చారు. కాని ఇదివరకు చేసుకొన్న కమ్యూనిస్టు వ్యతిరేక ఒడంబడికను అంటిపెట్టుకుని ఉంటాము, గాని సోవియటు యూనియన్ కలుగజేసుకొనక ముందే మేము ఇతర ఒడంబడికలకు రాము అని జపాను పత్రికలు తెలిపాయి. ఇది జపాను

బలహీనతను తెల్పుతుంది. జపాను చైనాకోసం తక్కిన విషయాల్లో మెదలకుండా ఉండాలని (బలంలేదుగనుక) చూసింది. కాని జర్మనీఆజ్ఞలు -సోవియటును రెచ్చగొట్టమని వస్తున్నాయి. ఉత్తర చైనాల్లో హాంకోలవద్ద అపజయం జపాను నిరుత్సాహపడింది. ఇలాగే వరసగా అపజయం కల్గిందా జపానులో విప్లవం రావచ్చునని భయం. అందుకని ఏదోవిధంగా తానేగాక ప్రపంచమంతా యుద్ధంలో చిక్కోవాలి అని జపాను ఆశ. ఇందుకనే ఇదివరకొకసారి గట్టిగా చెబ్బతిన్నా, మళ్లా బౌటర్ మంగోలియాలోను, సోవియెట్‌తోను గిల్లి కజ్జాపెట్టుతోన్నది. ఇటు బ్రిటీషువారిని రెచ్చగొడుతూంది.

చంగ్‌షివాంగ్ (జపాను అనుకూలుడు)ని హత్య జేశారని అనుమానింపబడ్డ నల్గురిని జపాను తన కప్పగించమని జపాను కోరింది. కాని తగిన సాక్ష్యంలేదని బ్రిటన్ నిరాకరించింది.

కాల్గాన్‌వద్ద ఇద్దరు బ్రిటీషువారిని—లెఫ్టినెంటు కర్నల్ హూపర్, స్పియర్ అనేవారలను-గూఢచారులనే వంకతో జపాను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఇంతేగాక పూటుంగ్‌వద్ద అరెస్టుచేయబడ్డ ఆర్. యం. టిన్లర్, హెచ్, మెక్ అల్లిస్టర్ అనే బ్రిటిషువారిని హత్య చేసింది జపాను ప్రభుత్వం.

బ్రిటీషు ప్రభుత్వం పంపుతున్న అసమ్మతులకు బదులు, జపాను 'చంగ్‌కి షాంగ్‌న. హత్యజేసిన వారిని అప్పజెప్పాలనీ. అలా అప్పజెప్ప లేకపోతే టీన్‌ట్సిన్ పట్టణంలోని బ్రిటిషు ప్రదేశాన్ని దిగ్బంధనజేసి నిస్సహాయులుగా చేస్తామని జపాను బెదరించింది. అపుడే జపాను వర్తకులంతా, జపాను బాంకును ఖాళీచేశాయి. కొందరు లేచిపోయారు. పూర్వం సోవియటు విదేశ రాయబారి ఉండే ఆఫీసును కమ్యూనిస్టు వ్యతిరేకులు ఆక్రమించుకొని తమ జండాను స్థాపించుకొన్నారట. ఇన్ని అఘాయిత్యాలు జరుగుచున్నా బ్రిటన్, ఫ్రాంసు, అమెరికాలు కలిసి ప్రాచ్య ప్రదేశంలో జపానువాడిని ఎదుర్కోడంలేదు. ఈమధ్యనే హాలిఫాక్సు (ఇర్విను) ప్రభువు మాటాడుతూ బ్రిటిషువారి హక్కులన్నీ జాగ్రత్తగానే కాపాడబడుతూ ఉన్నవని అన్నాడు. ఎన్నడో జపాను బ్రిటన్ ఫ్రాంసుల ధిక్కరించింది.

## ఛాంబర్లేను : ఫేసిస్టు దేశాలు

ఫేసిస్టులు ఎంత బెదరిస్తున్నా ఛాంబర్లేను గాని, బ్రిటన్‌ను పరిపాలిస్తున్న తదితర మంత్రులుగాని, హిట్లర్ ముస్సోలినీలను సంతృప్తి పరచే విధానం(అపీజ్‌మెంటు పాలసీ) మానుకోలేదు. ఒకప్రక్క బోల్షివిజానుండి యూరప్‌ను రక్షించడానికి పోప్ 'నాల్గురాజ్యాల ఒడంబడిక కోసం' సభ జరిపించాలని ప్రయత్నాలుచేస్తూనే ఉన్నాడు. లేదని ఒకప్రక్క ప్రకటిస్తూనే హాలిఫాక్సు ఛాంబర్లేను ప్రకటనలు దీనికి దోహదమిస్తున్నాయి.

హాలిఫాక్సు ప్రభువు పార్లమెంటులో మాటాడుచూ "దేశాల స్వాతంత్ర్యానికి భంగపాటు కల్గించకుండా ఉంటే జర్మనీకేగాక, ఇతర యూరోపియన్ దేశాలన్నిటికి ఆర్థిక సమస్యల పరిష్కరించు మార్గాలను బ్రిటన్ వెదకుతుంది."

"శాంతిని నెలకొల్పే పరిస్థితులమీద ఇతరుల కోర్కెల తీర్చడానికి బ్రిటను ప్రయత్నించుచుంది. మేము రాయబారాలద్వారా సమస్యల పరిష్కరించడానికి ప్రయత్నిస్తాం. ఇంకోవిధంగా అయితే-అంటే దౌర్జన్యం ఉపయోగించడం వల్ల-అంతర్జాతీయ జీవితం నడవజాలదు."

"సంధి సంప్రదింపులు జరపడంలో రోజు రోజుకూ మారుతున్న ప్రపంచపు కోర్కెలను సంతృప్తి పరచడంలో-హక్కులను సర్దుకోవడంలో కొన్ని కష్టాలుంటాయని ముందుగానే తెలుసుకోవాలి."

ఛాంబర్లేనుకూడా ఇదే ధోరణితో మాటాడుతూ, "ఒకరౌంట్‌టేబిల్‌సభజరిపి జర్మనీతోగాని, మరి ఏఇతర దేశాలతోగాని వారి కోర్కెల చర్చించడానికి మేమెప్పుడూ సంసిద్ధమే అయితే అది న్యాయమైనసమాధానం తెస్తుందనినమ్మకం ఉండాలి. అలాంటిది జరగవచ్చుననే నమ్మకం, సమాధానాల ద్వారానేగాని బలవంతంగా సమస్యల పరిష్కరించరాదనే విశ్వాసం, మనకుండాలి."

ఈ ప్రకటనలవల్ల తేలేదేమిటి?

## ఆంగ్లో—సోవియట్ రాయబారాల విఫలమా?

బ్రిటన్ ఎన్నిదేశాలకు హామీఇచ్చినా ఇంకా పూర్ణంగా చర్చించి ఒడంబడికలపై దస్కతులు చేసికోలేదు. సోవియటు యూనియనుకు బ్రిటిషు అధికారి-విలియం స్ట్రాంగ్‌ను పంప నిశ్చయించుకొన్నా రాయబార ఫలితాలు విఫలమౌతాయన్న సంశేహం మరీప్రబలుతుంది. ఛాంబర్లేను ఈవిషయమై ఇలా తెల్పాడు.

"ఒకటి రెండువిషయాలు క్లిష్టంగా ఉన్నై. కొన్ని రాజ్యాలు తమకు రక్షణ కోరడం లేదు. వాటికి రక్షణ ఇస్తాననటం అసాధ్యమైనది. "అయినా మరొక ఉపాయం చూస్తున్నాం"

ఆ ఉపాయంకూడా ఏమిటో సూచాయిగా తెలియవస్తున్నాయి, బ్రిటిషువారు సోవియట్‌కు తెల్పే సమాధానం ఇలా ఉంటుందట: "మూడు దేశాలకు (బ్రిటన్, ఫ్రాంసు, సోవియట్ యూనియన్) ఏ దేశపు ప్రధాన స్వత్వాలకు దెబ్బ తగిలినా(వైటల్ ఇంటరెస్టు)రక్షించడం" వీటిక్రింద బాల్కన్‌రాష్ట్రాలు వస్తాయని బ్రిటన్ చెబుతుంది. పేర్లు సూచించకపోయినా?

ఈ సంధిగ్ధ రక్షణకు ఒప్పుకోమనీ, ఒప్పుకోపోతే తాము జర్మనీతోకలుస్తామనీ ఒకవైపు సోవియట్ యూనియన్‌ను బెదరించడానికీ, మరొకవైపు వీలగా ఉంటే జర్మనీతో డాంజిగ్ పోలిష్ కారిడర్, కాలనీల విషయమై సంప్రదింపులు జరపడానికీ పై యుపన్యాసాలు పనికివస్తాయి.

అపుడే ఆస్ట్రేలియా ప్రధాని ఛాంబర్లేనును సమర్థించుతూ ప్రకటన గావించాడు. మరొకప్రక్క షాక్టు బ్రిటన్‌లో న్యాయమైన (రీజనబుల్) పెద్ద మనుష్యులున్నారని అంటున్నాడు. ఈ ఉపన్యాసాలకు బెర్లిన్ పత్రికలు కాలనీలను ఈయాలని కోరుతున్నాయి. కౌంటికియానో, బ్రిటన్ షరతు లేమీ పద్ధకుండా ఉంటే తాము సభలో పాల్గొంటానికి సిద్ధమే అని అన్నాడు. కాబట్టి మరొక 'సంతృప్తి' నాటకానికి నాంది ప్రారంభమయింది.

## డాంజిగ్‌కు ఎసరు

ఈ మెత్తదనం జూచి హిట్లర్ అపుడే అల్లర్లు సాగించాడు. ఆటల ఉత్సవం అనే పేరుతో, 40 వేల ప్రష్యన్ స్టాంప్‌ట్రూపర్సు డాంజిగ్ వెళ్ళారు. కాల్డాప్ ఉదంతాలకు విచారం జెప్పడం అలాఉంచి డాంజిగ్‌లో కస్టమ్సు ఆఫీసు ఉద్యోగస్థులను తగ్గించాలంటూ నాజీ సెనేటు పోలిషు ప్రభుత్వాన్ని కోరింది. పోలిషు ప్రభుత్వం, నాజీల దురాక్రమణ నేమాత్రము సహించమని తెలియజేసింది. డాంజిగ్‌వద్ద కస్టమ్సు ఇనస్పెక్టరు అగు లిథ్యూనీస్కని గూఢచారి అనే నెపంతో అరెస్టుచేశారు. కాబట్టి డాంజిగ్ నాటకానికి నాంది ప్రారంభమైన దన్నమాట? ...

# మునగాల రైతు దినోత్సవం

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షుని ఆదేశానుసారం, 11-6-39 వ తేదీని బెజవాడ పట్టణ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ యాజమాన్యాన గాంధీపార్కులో సాయంత్రం 6-30 గం.లకు బహిరంగసభ జరిగినది. కామ్రేడ్ తుమ్మల వెంకట్రామయ్యగారు అధ్యక్షత వహించారు. ప్రథమంలో కామ్రేడ్ జొన్నలగడ్డ రామలింగయ్యగారు ఉపన్యసిస్తూ, మునగాల జమీందారు అక్రమ పరిపాలనను వివరించి, శాంతియుతంగా సత్యాగ్రహం సాగిస్తున్న రైతుల్ని అభినందించారు. 4 వ తేదీని అమాయక ప్రజలపై లాఠీలు కురిపించి హింసించిన పోలీసుల చర్యను గర్హించారు. పిమ్మట వి. వి. నరసింహం, ఎం. ఎల్. ఏ గారు వుపన్యసిస్తూ, మునగాల తాను స్వయముగా వెళ్లినప్పుడు అక్కడ ప్రజలపై పోలీసులు జరిపిన దుండగాలను వర్ణించిచెప్పారు. అటుపిమ్మట జమీందారుకూ-రైతులకూ మధ్య జరిగిన ఒడంబడిక షరతులు వివరించబడిన తర్వాత, సత్యాగ్రహుల్ని అభినందిస్తూ, పోలీసుల దౌర్జన్యాలను ఖండిస్తూ రైతులకు న్యాయం కలిగించవలసినదిగా మద్రాసు మంత్రివర్గాన్ని హెచ్చరిస్తూ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

### కాశీపట్నం.

కాశీపట్నంలో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారి అధ్యక్షతక్రింద జరిగిన బహిరంగ సభలో "మునగాల రైతులు తమ సక్రమ హక్కులకై సత్యాగ్రహం చేయుచున్నందులకు వారిని అభినందించుతూ. రైతు సత్యాగ్రహులపై లాఠీచార్జీ, మొదలైన నిరంకుశ చర్యలకు కారకులైన పోలీసుల చర్యలను తీవ్రముగా గర్హించుచు, కాంగ్రెసు ప్రభుత్వములో కూడ యిట్టి ఘోర నిర్బంధాలు జరుగుచుండుట విచారపడుచూ" తీర్మానించబడెను.

### పాతపాడు.

కాశీపట్నానికి సమీపంలో ఉన్న పాతపాడులో కామ్రేడ్ పి. మృత్యుంజయుడుగారి అధ్యక్షతక్రిందను, పల్లిపాలెంలో కామ్రేడ్ కృత్తివెంటి వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతక్రిందను, జరిగిన బహిరంగ సభలలోకూడా మునగాల సత్యాగ్రహుల నభినందిస్తూ ఉపన్యాసము లివ్వబడి, తీర్మానించబడెను.

### ఒంగోలు.

11 వ తేదీని సమావేశమైన ఒంగోలు పట్టణ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం పాంచాలవరపు ప్రసాదరావుగారి అధ్యక్షతక్రింద సమావేశమై, "మునగాల ఎస్టేటులో జమీందారు రైతులపై గావించుచున్న అక్రమాలకు వానికితోడు రిజర్వు పోలీసులు ప్రజలపై గావించుచున్న లాఠీచార్జీలకు, నిర్బంధములకు తీవ్రమగు అసమ్మతిని వెలిబుచ్చుచూ, ప్రభుత్వంవారు వెంటనే జోక్యం కలిగించుకొని రైతుల బాధనివారణకు తోడ్పడవలెనని" కోరుచు తీర్మానించబడింది.

### చల్లపల్లి

దివితాలూకా రైతుసంఘ జనరల్‌బాడీ 10 వ తేదీ సాయంకాలం చల్లపల్లిలో సమావేశమై "తమ న్యాయమైన హక్కులకొరకు జమీందారుపై సత్యాగ్రహం సాగించుచున్న మునగాల ఎస్టేటు రైతు సోదరులను అభినందించుచూ" తీర్మానించెను.

### అన్నవరం

11 వ తేదీని గుడివాడ తాలూకా, అన్నవరం గ్రామములో శ్రీ కోడూరు అచ్చయ్యగారి అధ్యక్షతక్రింద జరిగిన బహిరంగ సభలో, "మునగాల ఎస్టేటు రైతుల సత్యాగ్రహం సందర్భంలో స్థానికాధికారులు ఒనర్చుచున్న అక్రమచర్యలను గురించి క్రమమైన విచారణ జరిపించి వెంటనే తగుచర్య గైకొన వలసినదిగాను, రైతుల న్యాయమైన హక్కులను కాపాడ వలసినదిగాను మద్రాసు కాంగ్రెసు మంత్రి వర్గమును కోరుచు" తీర్మానించ బడెను.

### గుడివాడ

ఈనెల 10 వ తేదీని శ్రీ వంగపాటి రంగారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమైన గుడివాడ తాలూకా కాంగ్రెస్ కార్యవర్గమువారు యీక్రింది తీర్మానాలన్ని ఆమోదించారు.

"మునగాలలో ఇదివరకు రైతులకు, జమీందారుకు, మధ్య జరిగిన రాజీని జమీందారు భంగపరచినందున ఆనాటి రైతులు సాగించుచున్న సత్యాగ్రహ పోరాటమును యీ సభవారభినందించుచూ రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు వెంటనే కలుగజేసుకొని, సమరసభావం కూర్చవలెననియు, లేనిచో సత్యాగ్రహ పోరాటమునకు అండగా నిలువవలెననియు, రైతులపై దారుణమైన లాఠీచార్జీలను జరిపిన పోలీసు దురంతముల ఖండించుచు, ప్రభుత్వంవారు విచారించి, పోలీసులపై తగుచర్య జరిపించవలసినదిగా కోరుచున్నారు."

### నందిగామ తాలూకా

పైతాలూకా కొణకంచి గ్రామంలో శ్రీ కొణకంచి చక్రధరరావుగారి అధ్యక్షత క్రిందను; పోచంపల్లి గ్రామములో గ్రామకాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ వానిరెడ్డి సూర్యప్రకాశనాయుడిగారి అధ్యక్షత క్రిందను; చెర్వుకొమ్ముపాలెములో గ్రామకాంగ్రెసు అధ్యక్షులైన శ్రీ యిందూరి వెంకటనారాయణరెడ్డిగారి అధ్యక్షత క్రిందను; గౌరవరంలో గ్రామకాంగ్రెసు అధ్యక్షులు తొండపు వెంకటేశ్వర్లుగారి అధ్యక్షత క్రిందను 11 వ తేదీని జరిగిన బహిరంగ సభలలో మునగాల రైతు సత్యాగ్రహుల్ని అభినందిస్తూ ఏకగ్రీవంగా తీర్మానములు ఆమోదించబడ్డాయి.



# సంజదివ్వె

(14 వ పేజీ తరువాయి)

డాక్టరు : ఎప్పుడైనా ఏ యువతి ఫోటోతోనైనా ఉన్నట్లు చూచినారా?

తల్లి : ఉహూఁ! ఎప్పుడూ....

(దాసి ఏడుస్తూ గదిలోకి చొరబడుతుంది)

దాసి : ఓ అమ్మా! అమ్మా!....నా కళ్లల్లోకి తీక్షణంగ చూసి, 'నిన్ను ప్రేమిస్తున్నా'నని అంటూ ఇప్పుడే మీ బాబు గోరీలతోటలోకి తోట దారిగుండా నడిచి పోతున్నాడు.—ప్రతిమాటని రోజా మాలలోని పుష్పాల్ని లెక్కించువిధంగా — అతినంటాడు నన్ను ప్రేమిస్తున్నాడట — కానీ నాతోటి అట్లాగ అనలేడు — నేను ప్రమాణంచేసి చెప్పగలను, అమ్మా — మరి దేముని కెరుక — అయినప్పటికి నాకు భయంగా ఉంది. నన్ను గాలి పట్టుకు పీడిస్తూంటి ఏదినమో ఒక దినం సంఘటిల్లుతుందని నాకు తెలుసు — నేనీ గోడలను ఇప్పుడింక భరించలేను. ఈ కుర్చీలను, పుస్తకములను, ఈ బల్ల, లాంతరుని భరించలేను— ఏదో మంత్రంక్రింద నాలో ఇదంతా పనిచేస్తూంది—ఇప్పుడు నీడలంటే ఎంతేనా భయపడుతున్నాను — అవును, నా నీడ అంటే కూడా భయంగా ఉంది.

తల్లి : ఇదిగో ఏయ్! పిల్లా! ఊరికే వెర్రెత్తిపోకు.

డాక్టరు : (తన మందుల సంచినుండి ఇంత చూర్ణం తీస్తూ) అంతా బాగుంది. అంతా బాగానే ఉంది. ఇదిగో కొంచెం తమాయింపుతో ఇది ఓ గ్లాసుడు నీళ్ళతో మ్రింగివేయ్. అదంతా నరాలకు సంబంధించినది. —నరాలు నీకు తెలుసుగా — కాని అవే సర్దుకుంటాయి — (తల్లిని ప్రక్కగా తీసికొని వెళ్ళి) నే ననుకొనేది ఈమేలాగుంది ఈ గొడవ కంతకి కారణం. మరి ఆమె ఏ మాత్రం ఎక్కువకాలం ఈ ఇంటిలో ఉంటానికి వీలు లేదు. లేకుంటే పత్రవాడు ఏ పనైనా తొందరపడి చేస్తాడు. అమెయే గావచ్చి విద్య....మరి గుడ్ నైట్ రేపు మళ్ళి వస్తాను.

(డాక్టరు బయటికి పోవును)

తల్లి : పిల్లా! నిజంచెప్పు. నీతోటి ఏమైనా చెప్పాడా?

దాసి : ఊఁ నా నడను పదేళ్లా చేస్తుంది కాబట్టి తనకు ఆ లాంతరంటే ఎంతో ఇష్టమని నాతో చెప్పాడు....

తల్లి : మరింకా ఏమిటి? — నీచేతినెప్పుడైనా తాకాడా?

దాసి : తాకాడమ్మా నా చేతులను తరుచు తన చేతులలోకి తీసికుంటాడు.

తల్లి : వాటిని ముద్దెట్టుకుంటాడనుకుంటా?

దాసి : ఉహూఁ! — వాటితోటి ఎన్నోరకాల నీడలను చేస్తాడు—అప్పుడే, ఈ వ్రేళ్ళతో నేను కంకాళము చేయ గల్గుచున్నా—ఓఁ పిచ్చెత్తి పోతుంది.

తల్లి : అతను నీచేతిని పట్టుకొన్నప్పుడు ఏవిధంగా ఉంటుంది. నీకు?

దాసి : అవి నీడల్లోకి మార్చబడతామేమో అన్నట్లు ఉంటుంది.

తల్లి : నీతో ఎప్పుడైనా, తాను నిన్ను ప్రేమిస్తున్నట్లు చెప్పాడా?

దాసి : ఒక్కసారి మాత్రం నన్ను ప్రేమి....

తల్లి : నిన్నే?

దాసి : కాదమ్మా—నానీడని—అయ్యో!—ఇప్పుడే పిచ్చెత్తిపోతాను పిచ్చెత్తిపోతాను.

(యువకుడు చేతిలో పూలతో ప్రవేశిస్తాడు.)

యువ : అతడు పోయాడా? మంచిది—ఇప్పుడు, పిల్లా విను....

దాసి : ఓ అమ్మా, చూడు, చూడు—అతని నీడ కేసి చూడు. ఎంత అందంగా జాలిగా ఉందో అది—వంపులకేసి చూడు. ఆ గీతలు ...ఎంత రాజత్వం....

యువ : అమ్మా.

తల్లి : ఏమిటి నువ్వు తీసికొని వచ్చింది?

యువ : పువ్వులు

తల్లి : ఎవరికోసం?

యువ : నేను ప్రేమించే వ్యక్తికొరకు

తల్లి : అయితే ఆమెకియ్యి

యువ : ఇక్కడ, తీసికో వీటిని—వీటిని ఎవరికిచ్చినప్పటికి నాకేమీ ప్రమేయంలేదు. ఎందుచేత నంటే అందరూకూడా నేను ప్రేమించేవారే. తిన్నగా ఈ పువ్వులను దీపానికెదురుగా పట్టుకో — చూడు, పుష్పాలను పట్టుకొన్న నీచేతుల నీడనిచూడు అర్థం చేసుకోలేవూ. ఇప్పటికీ?

తల్లి : పిల్లా లాంతర్ని ఈ గదినుండి అవతలికి తీసికొనిపో, నాకు నీడలంటే భయం.

(ఒక పొడుగైన ఆకృతి, నీడలాగ, తల్లి కెదురుగుండా గోడమీద కనుపిస్తుంది) ఓఁ! నీడ....నీడ....ఏమ్ నీడా ఎవరు నీవు?

యువ : అదే నాన్న, మన ప్రేమఛాయ.

తల్లి : ఏమిటది? ఎక్కడున్నాను నేను? మరి ఈ పుష్పాలని ఎక్కణ్ణించి తీసికొని వచ్చినావు?

యువ : నాన్న గోరీమీదనుండి. అవినశ్వార్థపు వాసనలతో నిబిడీకృతం. ఆయన బ్రతికి ఉన్నప్పుడు, నేను నీడలవెంట బడుతూండేటప్పుడు, ఒకమాటు నన్ను పిచ్చి పనికేటంత పర్యంతం చేశారు—కాని ఇప్పుడు ఈపుష్పాలను సశ్చితాభిప్రాయ చిహ్నంగా పంపుతున్నారు. చూశావూ యదార్థ ప్రదేశాలకు నిను). నాతో తీసికొని వెడుతూన్నట్లు తనంతటతానే చూడగల్గుచున్నారు....నేను—ఛాయా ప్రియుణ్ణి.

తల్లి : నీడ నేను ప్రేమిస్తున్నా....

(నీడ మాయమౌతుంది)

దాసి : (యువకుని నీడతో) నిన్ను ప్రేమిస్తున్నా.......నీడ.......

యువ : ఆఖరికి మనం, ఛాయా ప్రియులము, నీడలమైన మనం, మన క్రొత్త ఇంటివైపు కదలిపోతూ, జీవిత నిరీక్షణ వధువుయొక్క గృహం....రా నన్ను, నిన్ను క్రొత్త ఇంటిలోకి గృహప్రవేశం చేయటానికి తీసికొనిపోనీ.

(అంధకారావృతమైన కవాటం, నిర్మలతను సూచించే మహోజ్వల కాంతికై తెరువబడును.)





# పామర్రు రాజకీయ వేసంగి పాఠశాల

పై పాఠశాలకు ప్రిన్సిపాల్‌గా ఉన్న కామ్రేడ్ లింగయ్యగారు పంపిన నివేదికలో యీ క్రింది వివరాలు ఉన్నాయి. పాఠశాల మే నెల 5 తారీఖున, అ॥ భా॥ రైతు సంఘ సహాయ కార్యదర్శి అయిన కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగారిచే ప్రారంభించబడి 24 వ తేదీ వరకు పాఠములు బోధించబడ్డాయి. స్కూలుకు 30 మంది విద్యార్థులు, 6 గురు విద్యార్థినులు వచ్చారు. క్లాసులు ప్రతిరోజు ఉదయం $6\frac{1}{2}$ నుండి 9 గంటల వరకూ, రాత్రి $7\frac{1}{2}$ నుండి 10 గంటల వరకూ జరిగాయి, ఉదయం $5\frac{1}{2}$ నుంచి $6\frac{1}{2}$ వరకూ కామ్రేడ్ మునపల్లి రామారావుగారు మిలిటరీ శిక్షణ యిచ్చారు.

### పాఠ్యక్రమము.

విద్యార్థులకు యీ క్రింది కార్యక్రమము ప్రకారము పాఠములు బోధించబడెను.

1. భారత జాతీయ పోరాటాలు :
   కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణగారు
2. సంస్థానాలలో ప్రజా ఉద్యమం :
   కామ్రేడ్ యం. వెంకటాచారి, ఎం. ఏ.
3. భారత కార్మికోద్యమం :
   కామ్రేడ్ తుమ్మల వెంకట్రామయ్య
4. నాస్తికత్వము—పరిణామవాదం :
   శ్రీ జి. రామచంద్రరావుగారు, ఎం. ఏ.
5. ఫెడరేషన్ :
   కామ్రేడ్ మునుపల్లె రామారావు బి. ఏ. ఎల్. ఎల్. బి.
6. కాంగ్రెసు—కిసాన్ సంఘాలు :
   కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు
7. ఫాసిస్టు, బూర్జువా, శ్రామిక, నియంతృత్వాలు :
   టి. గంగయ్యగారు, బి. ఏ. బి. యల్.
8. 1857 : స్వాతంత్ర్య పోరాటం :
   కామ్రేడ్ యం. రామమోహన్
9. సామ్యవాద సిద్ధాంతాలు :
   కామ్రేడ్ కె. యల్. నరసింహం, బి. ఏ.
10. రాజకీయ భూగోళశాస్త్రం :
    కామ్రేడ్ ప్రతాప రామసుబ్బయ్య
11. రైతు ఉద్యమం :
    కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగారు
12. భౌతికవాదం :
    కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు
13. రష్యా విప్లవం :
    యం. బసవయ్య
14. ప్రపంచ యుద్ధానంతర రాజకీయ సంఘటనలు :
    టి. కె. రామస్వామి, బి. ఎ., బి. యి. డి.

### జమా ఖర్చులు.

| | జమ |
|---|---|
| చందాలు | 114—6—0 |
| సామానుల అమ్మకం | 7—9—3 |
| | 121—15—3 |

| ఖర్చు | |
|---|---|
| ప్రింటింగు | 6—1—3 |
| పోస్టేజి | 3—0—0 |
| స్టేషనరీ | 1—13—0 |
| పందిళ్లు వగైరా | 15—14—6 |
| లేబరు | 10—15—0 |
| చాపలు వగయిరా | 7—8—6 |
| లైటింగు | 5—5—0 |
| పత్రికలు | 1—7—0 |
| ట్రావెలింగు | 9—10—0 |
| ఇంటి అద్దె, చాకలికి | 1—10—0 |
| ఉపన్యాసకులకు ఖర్చు | 22—5—6 |
| హోటలు | 19—6—3 |
| ఇతర ఖర్చులు | 2—13—6 |
| | 110—13—6 |

నిల్వ : 11—1—9

